జాతీయ పుస్తక సంస్థ ప్రచురణ :

# భారతదేశం
## నేడు - రేపు

[ఆజాద్ స్మారకోపన్యాసములు, 1959]

జవహర్‌లాల్ నెహ్రూ

తెలుగు అనువాదం :
కోలవెన్ను రామకోటీశ్వరరావు





భారత ప్రభుత్వ
సమాచార, రేడియో మంత్రిత్వశాఖ
ప్రచురణ విభాగము

"మౌలానా అబుల్ కలాం ఆజాద్ స్మారకోపన్యాసము"లను ప్రారంభిస్తూ ప్రసంగించమని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూను ఆహ్వానిస్తున్న సందర్భంలో, భారత దేశమునందు అనేక రంగములలో జీవితమునకూ సారస్వతమునకూ మౌలానా ఆజాద్ కావించిన ఉపకృతినిగూర్చి ప్రసంగించకుండా ఉండజాలను. యౌవన ప్రారంభమునందే ఆయన ఉజ్వల రచయితగానూ, తత్వవేత్తగానూ ప్రసిద్ధి గడించాడు. ఆ ప్రసిద్ధికి కారణభూతములైన లక్షణములే దీర్ఘకాలము ఆయనను కేవల తార్కికగోష్ఠులతో తృప్తిపడనిచ్చినవికావు. స్వతంత్ర జిజ్ఞాసా సత్యాన్వేషణమూ అనివార్యముగా ఆయనను రాజకీయోద్యమములోనికి దింపినవి. ఇరవైయేండ్లు దాటిననాటినుంచి భారత స్వాతంత్ర్య సమరములో ఆయన యోధుడుగా ఉండినాడు. స్వేచ్ఛావాతావరణములో తప్ప మానవుడు వాస్తవమైన, పూర్ణమైన వికాసమును పొందజాలడని ఆయన గ్రహించాడు ముప్పది అయిదవ యేట జాతీయ మహాసభకు అధ్యక్షునిగా ఎన్నుకొని భారతీయులు ఆయనను గౌరవించారు. తరువాత, స్వాతంత్ర్యసమరం సాగుతుండిన మహాక్లిష్టకాలంలో ఆరు సంవత్సరాలు ఆయన కాంగ్రెసు సారథ్యం వహించాడు. 1942 లోనూ, క్రిప్స్, వేవెల్, బ్రిటిషు కాబినెట్ మిషన్ సంప్రతింపుల ఘట్టాలలోనూ, ఆయనే కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్నాడు.

పండితుడుగా నుండిన మౌలానా ఆజాద్ ధీరుడైన రాజకీయ యోధుడుగా మారడానికి కారణం ఆయన స్వేచ్ఛాప్రియత్వమే. బహిరంగంగా హేతువాదాన్ని సమర్థిస్తూ జాతీయ జీవితంలో అన్ని రంగాలలోనూ పురోగామి శక్తులను ప్రోత్సహించాడంటే దానికి కారణం ఆ ప్రేమయే. నిర్లిప్తంగానూ, నిర్మమత్వంతోనూ, సాంఘిక, ఆర్థిక రాజకీయ రంగాలలోనూ, నైతిక తాత్విక విషయాలలోనూ, ఆయన వ్యవహరించాడు. న్యాయమూ, స్వాతంత్ర్యమూ, ఆయన జీవితాన్ని నడిపిన సూత్రాలు. ఈ రెంటినీ కుల మత భాషా వివక్షత లేకుండా యావద్భారత ప్రజానీకానికి సమకూర్చడానికి ఆయన కృషిచేశాడు.

ఆలోచనలో స్పష్టతా, వివేచనలో సమతా, ఆయన మనః ప్రవృత్తికి చెందిన ప్రముఖ లక్షణాలు. ఏ సమస్య గానీ, వెనువెంటనే దాని మూలాన్ని

కనిపెట్టగలిగేవాడు. అప్రధానమైన బాహ్య విషయాలను గమనించేవాడుకాదు. విషయంలో సారాంశాన్ని పట్టుకోగల సామర్థ్యమే గాక దానితోపాటు సునిశిత మైన న్యాయదృష్టి సత్ప్రవర్తనమూ కూడా ఉండేవి. ఏ విషయాన్నీ కూడా ఆయన పాక్షిక దృష్టితో గమనించేవాడు కాదు. తనతో భిన్నాభిప్రాయం గల వ్యక్తుల లోపాలను సర్దుకుపోవడానికి సర్వదా సమ్మతించేవాడు. ఒక వ్యక్తి యెడల తనకు గల ఇష్టానిష్టాలను బట్టి నిర్ణయాలు చేసేవాడుకాదు. నిర్లిప్తమైన బుద్ధీ, వివిధ దృక్పథాలను సమాలోచించగల శక్తి, ఆయన నిర్ణయాలకు ప్రత్యేకమైన విలువను కల్పించేవి.

మౌలానా ఆజాద్ స్వాభావికంగా విద్వాంసుడు. పరిస్థితుల ప్రాబల్యం ఆయనను రాజకీయాలలోనికి లాగింది. ఆయన పదిమందిలోనూ తన ఘనతను ప్రకటించుకోడానికి ఎంత విముఖుడో గమనిస్తే ఆయన విద్యాపరత్వం సువ్యక్త మవుతుంది. భారతదేశంలో గాని, ఇతర దేశాలలో గాని రాజకీయ నాయకులు సామాన్యంగా ప్రజాసంపర్కంవల్ల తమ బలాన్ని పెంచుకుంటారు. కాని మౌలానా ఆజాద్ రాజకీయరంగంకంటే విద్యావ్యాసంగమే అభిమతంగా పెట్టు కున్న మునితుల్యుడు. ఆయన ఏకాంతప్రవృత్తి ఆయనను భారత ప్రజానీకానికి మరింత ప్రేమపాత్రుని కావించింది. ఆయనమృతికి తమ దుఃఖాన్ని వెలిబుచ్చుతూ ప్రజలు కావించిన అఖండప్రదర్శనంతో తుల్యమైనది గాంధీజీ ఆత్మార్పణ సందర్భంలో తప్ప వేరొకటి కానరాదు.

మౌలానాఆజాద్ "ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్" అన్న ఈ సంస్థను స్థాపించడమే గాక, దానికి అధ్యక్షుడుగానుండి ప్రథమంనుంచీ సంస్థ కార్యక్రమములకు ప్రేరకుడుగా ఉండినాడు. ఆయన స్మృతికి గౌరవచిహ్నంగా "ఆజాద్ స్మారకోపన్యాసములు" అన్న పేరిట ఉపన్యాసములను ఇప్పించడానికి ఈ సంస్థ నిర్ణయించింది. మానవ సంక్షేమానికీ అభ్యుదయానికీ సంబంధించిన సమస్యలను గూర్చి— భారతదేశ ప్రసక్తి ప్రధానంగా పాటిస్తూ—ఉపన్యసించ డానికి ఈ దేశంలోనూ ఇతరదేశములలోనూ సమర్థులైన పండితులను ఆహ్వానించుటకు సంకల్పించింది. మౌలానాఆజాద్ మానవత్వమునందు అభి మానం గలవాడు. మానవుల ఆలోచనలకూ భావములకూ, భావములకూ క్రియలకూ చెందిన ప్రతి విషయంలోనూ ఆసక్తి గలవాడు. ఈ ఉపన్యాసములు భిన్నజాతులమధ్య సౌహార్దమును పెంచడానికిన్నీ, ఈనాడు ప్రపంచమును

ఆవరించిన ఉద్రేకాలను కొంతవరకు శమింపజేయడానికిన్నీ ఉపకరించగలవని ఈ సంస్థ ఆశిస్తున్నది.

శ్రీ జవహర్ లాల్ నెహ్రూ ప్రారంభోపన్యాసము లివ్వడానికి అంగీకరించడం విశేషించి మా అదృష్టం. రాజ్యాంగవేత్తగానూ, అంతర్జాతీయ ప్రతిష్ఠ గడించిన రచయితగానూ, ఆయనకుగల ఉన్నతస్థాయిని గూర్చి నేను ప్రశంసించుటకు తగను. ఆలోచనా పరత్వంలోనూ, కార్యపరత్వంలోనూ గ్రంథ రచనలోనూ, ఆయన ప్రదర్శించిన చిత్తశుద్ధిని గూర్చి ప్రశంసించక తప్పదు. ఆ చిత్తశుద్ధియే ఆయనలోని ప్రధాన లక్షణం. ఆయనకు ఆలోచనతోనే భావౌత్సుక్యమూ, ఔత్సుక్యముతోనే క్రియాచరణా, సంబంధించి ఉంటవి. అతి త్వరిత గతిని సమకూడే ఈ సమన్వయము కొందరు మందబుద్ధులకు ఆశ్చర్యాన్నీ, ఉద్వేగాన్నీ కలిగించవచ్చును. పునరాలోచనకు అవసరములేని స్వచ్ఛమైన చిత్తశుద్ధికి అదే ప్రమాణము. ఆయన విషయంలో అనుభూతికీ, అభివ్యక్తికీ అంతగా ఎడముండదు.

వ్యక్తిలో నైతికస్థాయికి మూలం చిత్తశుద్ధి. నెహ్రూపండితుని స్వభావంలో ఎప్పటికప్పుడు ఉత్సాహమూ, బలమూ ఉబుకుతూ ఉండడానికి అదే కారణం. ఎవ్వరికి గాని, ప్రవృత్తి విషయంలో కారాగారవాసం విషమపరీక్ష వంటిది. అందులో, శారీరకమైన బాధకంటే మనిషి మనోదార్ఢ్యంమీద ఒత్తిడి మిక్కుటంగా ఉంటుంది. మామూలు వ్యాపారాలు నిర్వహించడానికి గాని, తోడివారిని కలుసుకొనుటకు గాని అవకాశం లేనందున మనిషి తన భావాలతోనూ, ఆలోచనలతోనూ, సరిపెట్టుకోవలసి ఉంటుంది. నిర్వ్యాపారం నిర్బంధంగా ఏర్పడినప్పుడు దాని ఒత్తిడి దుర్భరం కాకతప్పదు. ఆ ఒత్తిడియొక్క ప్రాబల్యం మనిషిలోని చైతన్యాన్నీ, బలాన్నీ పట్టి ఉంటుంది. చాలామంది రాజకీయ నాయకులు కారాగారంలో ఉండగా ఉత్సాహాన్ని కోల్పోకపోయినా, ఆరోగ్యమును చెడగొట్టుకుంటారు. నెహ్రూపండితుడు తన కారాగారవాసాన్ని చాలావరకు చెక్కుచెదరకుండా గడిపినాడని చెప్పవచ్చు. ఆయన వ్యక్తిత్వానికి చెందిన భావనాశక్తి, ఆలోచనా పరత్వమూ, సంకల్పబలమువల్లనే ఆయన అట్టి స్థితిని నిలుపుకో గలిగాడు. ఆయన సంకల్పాలు కార్యరూపాన్ని తాల్చే అవకాశం లేకపోయినప్పుడు, భావనలకూ, ఆలోచనలకూ సంబంధించిన జీవితమే అంత వాస్తవంగానూ పరిణమించింది.

రాజకీయరంగంలో నెహ్రూపండితుడు నిర్వహించే ప్రతి కార్యంలోనూ భాషలోనూ, ఒక కళాజీవి భావనైశిత్యం ప్రత్యేక లక్షణంగా గోచరిస్తుంది. లజ్జ, లోచూపు కళాజీవికి పరిపాటిగా ఉండే లక్షణాలు. కాని దానికి ప్రత్యామ్నాయంగా అతనిలో ఒక విచిత్ర మానసిక ప్రవృత్తికూడా ఉంటుంది. తన ఆలోచనలూ, భావాలనూ ఇతరులకు అభివ్యక్తం చేయాలన్న ఆసక్తి ఉంటుంది. బహిః ప్రపంచంద్వారా కలిగే ఉద్దీపనలకు ప్రతిగా తనలో ప్రభవించే భావాలను రేఖా, వర్ణ, భాషా రూపాలలో వ్యక్తపరచడంతో తృప్తిపడతాడు. అరుదుగా ఒకానొక కళాజీవి తన భావంలోని గాఢత్వంవల్ల, పై విధానాలతో తృప్తిపడక, వాస్తవికమైన జీవితరంగంలో ప్రవేశించి తన పరిసరాలను మార్చడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడు కళాజీవి రాజకీయయోధులలో లీనమవుతాడు. కాని అప్పటికికూడా, సమరసన్నాహాల మధ్యలోనూ, పోరాటంలోనూ అతని కళాజీవి లక్షణం అతనిని అంటిపెట్టుకునే ఉంటుంది. ప్రజాజీవితంలో పాల్గొన్న కళాజీవికి ఉత్తమోత్తమమైన ఉదాహరణంగా, జవహర్‌లాల్ నెహ్రూ వన్న మిన్నయైన వ్యక్తి చరిత్రలో అరుదని చెప్పవలెను.

ఏ రంగంలోగాని ఘనతతోపాటు కొంత వైపరీత్యంకూడా మిశ్రమమై ఉంటుంది. ప్రతిభకు ఉజ్వలత్వమూ సంకీర్ణత్వమూ, భిన్నలక్షణాల కలయికవల్లనే చేకూరుతుంది. కాబట్టి నెహ్రూ పండితుని స్వభావంలో శాస్త్రవిజ్ఞానమూ, కళాప్రియత్వమూ సమంగా ఉండడంలో ఆశ్చర్యమేమీ లేదు. వ్యక్తులనూ వ్యవహారములనూ విమర్శించడంలో నిర్లిప్తమైన, విషయప్రధానమైన దృష్టిని ప్రదర్శించడానికే ఆయన సర్వదా కృషి చేశారు. అన్వేషణ, విమర్శ, ఆకాంక్ష ఆయనలో స్వభావసిద్ధంగా ఉన్నవి. అందువల్లనే పాక్షిక దృష్టిని అవలంబించడం ఆయనకు అసంభవం. ఒకానొకప్పుడు తన కార్యవిధానాన్ని అంతిమ విషమ పర్యవసానంవరకూ నెట్టడానికి ఆయన తటపటాయించేవాడు. కాని, ఈ లక్ష్యమే ఆయన ఆలోచనలో రచనలలో కార్యాచరణలో ఒక విశాలదృష్టినీ వివేకాన్నీ ప్రదర్శింపజేయడానికి తోడ్పడినది. విజ్ఞానవేత్తగా ఆయనకు విశిష్టతను చేకూర్చినది కూడా ఆ లక్షణమే.

కాలం అస్థిరమైనది కావడమూ, దేనికిగాని క్షీణదశ అనివార్యం కావడమూ, జీవిత సర్వస్వమునుగురించిన విషాదభావనకే కారణమవుతున్నవి. ఇంగితజ్ఞానంగల ఏ వ్యక్తికిగాని ఈ భావం తప్పక కలుగుతుంది. కాని వీర

ప్రవృత్తి దుఃఖాన్ని నిర్వేదాన్ని అధిగమించి, మానవ ఔన్నత్యానికి స్థిరత్వం కల్పించడానికి ప్రయత్నిస్తుంది. మృత్యుచ్ఛాయలు ఆవరించిన లోయలలో అడుగులు వేస్తూనే, ముందున్న ఉజ్వల శిఖరాలను ఎన్నడూ విస్మరించని వీరుడే మహానాయకుడు. నెహ్రూ పండితుడు ధైర్యసాహసాలతోనూ, సహనంతోనూ, కష్టపరంపరలనూ, మృత్యువునూ సైతం ఎదుర్కోగల జీవిత విలువలను మనము గుర్తించేటట్లు ఉద్దీపన కల్పిస్తాడు. ఆయన రచనలూ కార్య కలాపాలూ మానవౌన్నత్యభావంతో నిండిఉంటవి. మౌలానా ఆజాద్‌తో ఆయనకు సన్నిహిత సంబంధాన్ని చేకూర్చిన దివ్యసూత్రం అదే. భారత సంస్కృతిలోని వైశాల్యానికీ మానవత్వానికీ ఆయనను మహోత్తమ ప్రతినిధిని కావించినది కూడా అదే.

"అనేకత్వంలో ఏకత్వం" అన్నదే భారతీయ తాత్త్వికసారం. మిగతా ప్రపంచానికి కూడా అదే సుసంగతమైనట్టియూ, నిజానికి ఎంతో అగత్యమైన ట్టియూ, ఆదర్శం కాగలదు. అందువల్లనే నెహ్రూ పండితుని "భారతదేశం: నేడు, రేపు" అనే దర్శనం, నూతనరూపం పొందుతున్న సమయంలో వచ్చే సవాలును ఎదుర్కోవలసిన భారతీయులకే గాక, ప్రపంచంలోని జిజ్ఞాసులైన స్త్రీపురుషులకందరకూ కూడా గమనార్హమైనది.

ఆజాద్ స్మారకోపన్యాసాలను ప్రారంభించమని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూను నేను సంతోషపూర్వకంగా అభ్యర్థిస్తున్నాను.

న్యూఢిల్లీ
ఫిబ్రవరి 22, 1959

హుమయూన్ కబిర్

★

# 1

నా ఉపన్యాసాన్ని ఒక క్షమాపణతో ప్రారంభించాలి. దీర్ఘకాలంగా నాకు ప్రజావ్యవహారాలతో సంబంధం ఉన్నది. అనేక పర్యాయములు ప్రజా సమావేశాలలో ప్రసంగించాను. కాని, ఈనాడు నావల్ల వినవలెనని మీరు ఆశిస్తున్న ఉపన్యాసంవంటిది మాత్రం నాకు అభ్యాసంలో లేదు. నేటి ఉపన్యాసం భావగర్భితంగానూ, పాండిత్య స్ఫోరకంగానూ ఉండవలెను, దానిని సిద్ధపరుచుకోవడానికి చాలా కాలం వినియోగించవలసి ఉంటుంది. ఇటువంటి విషయాలలో నాకు అనుభవం లేకపోవడం అలా ఉండగా, ఒకవైపు పార్లమెంటు బడ్జెటు సమావేశం జరుగుతున్నది. నిత్యకృత్యాలతోనే నాకు సరిపోతున్నది. అందువల్ల ప్రస్తుత సందర్భానికి తగినట్లు నా ఉపన్యాసాన్ని సిద్ధపరుచుకోవడం దుర్ఘటం.

ఈ బాధ్యతను నిర్వహించడానికి కొంత సంకోచించాను. కాని ఏదో ముహూర్తంలో మొగమాటపడి సరేనన్నాను. మౌలానా ఆజాద్ వర్ధంతినాడు నా శ్రద్ధాంజలిని సమర్పించాలనే కోరిక కలిగింది. ఆయన స్మృతిని మనం పరమ ప్రియంగా పోషించుకోవలెను. నాకు సూచించిన ఉపన్యాస విషయం కూడా నన్ను ఎంతో ఆకర్షించింది. భారతదేశపు వర్తమాన భావిస్థితిగతులు ఏదో విధంగా నా మనస్సును ఆవేశించి ఉన్నవి. అయినా కొంచెం కలవరం కలిగింది. విషయం మనకు చాలా ప్రాణప్రదమైనది. నేటి దేశస్థితిగతులతో నాకు అతి సాన్నిహిత్యం ఉండడంచేత, నిర్లిప్తమైన దృష్టితో సమీక్షించడం సాధ్యంకాదేమో ననిపించింది. ఇటువంటి ఉపన్యాసం నాకు ప్రథమ ప్రయత్నం కావడమూ, ఇతర కార్యభారం ఒత్తిడి కావడమూ, కారణంగా నా ఉపన్యాసాన్ని సాను భూతితో గ్రహించాలని మనవిచేసుకుంటున్నాను.

నేటి భారతదేశాన్ని అర్థంచేసుకుని సరిగా చిత్రించడానికి యత్నించడం సాహస కార్యమే. రేపటి స్థితినిగూర్చి చెప్పడం మరీ సాహసం. ప్రపంచచరిత్రలో ఎన్నడూ కూడా, ఒక దేశంయొక్క లేదా ప్రపంచంయొక్క భవిష్యత్తును గూర్చి చెప్పడం, ఈనాడున్నంత క్లిష్టకార్యంగా ఎన్నడూ లేదు. నమ్మరానంత

వేగంగా సంఘటనలు సాగిపోతూ ఉన్నవి. మార్పువెంట మార్పు తెరిపిలేకుండా వస్తున్నవి. నిజానికి, ఎంతో లోతుపాతుగానున్న అసంఖ్యాక ప్రవాహాలను, పైపైననే ఉన్న రాజకీయాలు కప్పివేస్తున్నవి. కాని ఆ ప్రవాహాలు అప్పుడప్పుడు పైకి ఉబికి పరిస్థితులను తారుమారు చేస్తున్నవి.

నేటి భారతదేశం అద్యతనభూతకాలంనుండి పుట్టుకువచ్చినది మాత్రమే కాదు. వేలసంవత్సరాల ఫలితంగా రూపొందిందికూడాను. ఒకదానిపై ఒకటిగా పొరలుపొరలుగా పేరుకున్న భావాలూ, అనుభవాలూ, ఆచరణలూ మనలను నియమిస్తూ ఈనాటి స్థితిలో మనలను నిలిపినవి. నా తరంనాటి ప్రజానీకం ప్రధానంగా ఒక ఘటనాపరంపరచేత పరిణతి పొందినది. ఆ ఘటనలు ప్రాయశః ఇంకొకపర్యాయం సంభవించేవికావు. ఆ కాలంలో మనకొక మహాపురుషునితో, మహానాయకునితో సంబంధం కలిగినది. ఆయన మన జీవితాలను మూలమట్టంగా కదిలించినాడు. తారుమారు చేసినాడు. మామూలు పూర్గంనుండి మనలను బయటికి లాగివేసినాడు. అంతేకాదు. చారిత్రిక ప్రఖ్యాతిగడించిన సంఘటనలను మనం కళ్లారా చూచినాము. వాటిలో పాల్గొన్నాము. భావోద్రేకాన్నీ భావోన్నతినీ పలుమారు రుచిచూచినాము. అప్పుడప్పుడు నిరుత్సాహాన్నీ నిర్వేదాన్నీ కూడా పొందకపోలేదు. కాని ఆ నిరుత్సాహం ఆ నిర్వేదం శాశ్వతమైనవికావు. ఉద్రేకస్థితి వెంబడినే మానసికంగానూ శారీరకంగానూ ప్రాప్తించిన దీనావస్థనుంచి మనం తప్పించుకుంటూ ఉండకలిగినాము. మనకు అనుక్షణమూ ఒక ఆలంబన ఉండేది. ఒక పర్వతశిఖరంవలె, ఒక దీపస్తంభంవలె ఆ మహానాయకుడు నిలబడినాడు. అంతేకాక, మనలను పులకితులను కావిస్తూ మనలోని ఉత్తమ లక్షణాలను బహిర్గతం కావించగల మహోద్యమం ఉన్నది. ఆ కాలంలో మనం అంతగా సుఖమనుభవించకపోగా, ఒక్కొకప్పుడు విపరీతమైన బాధపడ లోనైనాము. అయితే, ఉత్తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నామనీ, కాలగతిని గమనించి పురోగమిస్తున్నామనీ, సంతృప్తి నిత్యంగా మనకు ఉండేది. ఆలోచనా ఆచరణా ఏకమై నడిచినవి. అందువల్ల జీవితం సమగ్రమైనదిగా స్ఫురించేది. రాజకీయ రంగంలో కూడా నైతికస్థాయిలో ఉత్తమాదర్శాలతో వ్యవహరిస్తున్నామన్న విశ్వాసమే ప్రధానంగా ఉండి మనలను రక్షించింది. సాధారణంగా జాతీయ పోరాటాలలో మనలను కృంగతీసేది ద్వేషప్రవృత్తి. అట్టి ప్రమాదం మనకు లేకుండాపోయినది.

మన కళ్ల ఎదుటనూ, మనస్సులోనూ, గాంధీజీ నిత్యమూ నిలిచిఉండే వాడు. ఇంకా ఇతర నాయకులు—అతిమానుషప్రతిభాశాలురు—ఉండేవారు. ఒక మహదాశయమునకు కట్టుబడి, ఒక మహానాయకునికి విధేయులై ఉండుటవల్ల తమస్థాయిని మహోన్నతంగా పెంపొందించుకున్న స్త్రీ పురుషులు అసంఖ్యాకంగా ఉండేవారు. అట్టివారిలో ఉత్తమశ్రేణికిచెందిన వ్యక్తి మౌలానాఆజాద్. అప్పటికి ఆయన వయస్సుచేత యువకుడు. కాని అనుభవంలోనూ, వైదుష్యంలోనూ పెద్ద వాడై మనకు లక్ష్యభూతుడుగాఉండేవాడు. మనస్వాతంత్ర్యోద్యమంలో ఆయన స్థానం విశిష్టమైనది. భారతజాతి సర్వదా దేనికై కృషిచేసిందో, అట్టి సాంస్కృతిక సామరస్యానికి ప్రతినిధిగా ఆయన అనన్యస్థానం ఆక్రమించారు. సంకుచిత జాతీయ భావాలనుండి మనలను వెలుపలికి లాగి మనదృష్టిపథాన్ని విశాలవంతం చేశారు. ఒక పరమ ప్రయోజనమును సాధించడానికై, వేర్వేరు ప్రకృతులు గల వేలాది జనం, తమలో తాము దృఢసంబంధాన్ని సాధించి ఏకోన్ముఖంగా ఒక పురుషాంతరమువరకు కృషిచేయడమనేది ఆశ్చర్యమైన సంఘటనసుమా !

# 2

భారతదేశం అంటే ఏమిటి ? ఈ ప్రశ్న మాటిమాటికీ నన్ను వెంటాడుతూ ఉంటుంది. భారతదేశపు పురాతన అధునాతన స్వరూపాన్ని గూర్చి నా ఆసక్తి కొద్దీ సమాలోచించి ఒక సమాధానానికి రాగలిగినాను. మన చరిత్ర ప్రారంభ దశ నాకు ఆశ్చర్యజనకంగా ఉంటుంది. సత్త్వమూ, శక్తీ, స్వతంత్రాన్వేషణమూ కలిగిన ఒక జాతి చరిత్ర అనిపిస్తుంది. ఆ ప్రథమదశలోనే పరిపక్వమైన, సహనాత్మకమైన, సభ్యత ఆ జాతికి ఉండినట్లు ప్రామాణికంగా చెప్పవచ్చు. జీవితానికి చెందిన ఆనందాన్నీ, బాధ్యతలనూ స్వీకరిస్తూ సర్వగతమైన పరమలక్ష్యాన్ని నిరంతరంగా అన్వేషిస్తూ ఉండిన జాతి అది. ఆ జాతి నిర్మించుకున్న సంస్కృత భాష అద్భుతమైనది. ఆ భాషద్వారానూ, కళాశిల్పములద్వారానూ తన సందేశాన్ని సుదూర భూములలో మారుమ్రోగేటట్లు చేసినది. ఉపనిషత్తులను, గీతను, సృష్టించింది. బుద్ధభగవానునికి జన్మస్థానమైనది.

ఒకజాతి చరిత్రలో సంస్కృతంవలె ప్రబలశక్తిగా పనిచేసిన భాష వేరొకట ప్రపంచచరిత్రలో అరుదు. ఆ భాషలో ఉత్తమ భావములూ, ఉత్తమ సారస్వతమూ ఉండడమే కాక, ఇన్ని రాజకీయ విభాగములు కల భారతదేశాన్ని సమైక్యం చేసింది సంస్కృతభాష. వేలకొలది సంవత్సరాలుగా అతులాది ప్రజల జీవితంలో రామాయణ మహాభారతములు పడుగు పేకలుగా పెనుచుకుని పోయినవి. బుద్ధునీ, ఉపనిషత్తులనూ, మహాపురాణములనూ మనజాతి విస్మరించడమే సంభవిస్తే మనస్థితి ఏలాఉంటుందోనని నాకు తరచు అనిపిస్తూ ఉంటుంది. బహుకాలంగా మనజాతిని అంటిపట్టుకుని విశిష్టతను సమకూర్చిన మూల లక్షణాలను కోల్పోయిన తరువాత అది కూకటివేళ్ళతో పెల్లగిలిన వృక్షం కాకతప్పదు. అప్పుడు భారతదేశం భారతదేశమే కానేరదు.

# 3

క్రమంగా పతనం ప్రారంభమైనది. భావబలం వికాసమును కోల్పోయి ప్రాతపడిపోయినది. యౌవనోచితమైన శక్త్యుత్సాహాలు క్షీణించి, వార్ధక్య లక్షణాలు పట్టుబడినవి. పురుషకారానికి బదులు చేతనారహితమైన గతానుగతికత్వం పాదుకున్నది. ప్రపంచాన్ని విశాలమైన ఉత్సాహపూరితమైన దృష్టితో చూడడం పోయింది. కులభేదాలూ, సంకుచితములైన సాంఘికాచారాలూ, శుష్కకర్మకలాపాలూ ఆ దృష్టిని కప్పివేసినవి. అయినా బయటినుంచి వచ్చిన ప్రజాప్రవాహాలను తనలో లీనంచేసుకోగల సామర్థ్యం భారతదేశానికి ఉండినది. ప్రారంభదశలోని భావచైతన్యాన్నీ, పటుత్వాన్నీ భారతజాతి ఎన్నడూ పూర్తిగా విస్మరించలేదు.

తరువాత ముస్లిముల దండయాత్రలూ, ఇస్లాముతో సంపర్కమూ నవ ప్రభావాన్ని భారతదేశంపైన తీవ్రంగా ప్రసరింపచేసినవి. ఆ తరువాత పాశ్చాత్య వలస రాజ్యాలు ప్రవేశించినవి. దానితోపాటు వలస విధానంలో క్రొత్తరకపు ప్రభుత్వాధికారం ఏర్పడినది. యూరపుఖండంలో వర్ధిల్లుతూ ఉండిన పారిశ్రామిక నాగరకతా, నూతనభావాల ఒత్తిడికూడా వచ్చినది. ఏలాగైతేనేమి దీర్ఘకాలం

పోరాటం సాగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాము. ఆ విధంగా గడిచిన భూతకాలపు భారాన్నంతా మోస్తూ, భావికాలపు నిర్మాణాన్ని స్ఫూర్తి కలవరపు కలలు కంటూ ముందుకు సాగుతున్నాము. గత కాలమంతా నేడు మనలోనూ, మనదేశ పరిస్థితులలోనూ ప్రతిబింబిస్తున్నది. శక్తి బలాన్ని నియత పద్ధతిలో వినియోగించుకోవడమే ఆధునికయుగ లక్షణం. ఇప్పుడు భారత దేశంలో ఒకవైపు పరమాణుశాస్త్ర విజ్ఞానమూ, దాని ప్రభావమూ, ఇంకొక వైపు గోమయ సంప్రదాయమూ కనిపిస్తూవున్నవి. మనదేశంలో ప్రతి శతాబ్దికి చెందిన లక్షణాలూ ఉన్నవి. అంటే అపారమైన వైవిధ్యం ఉన్నదన్నమాట. బహుకాలంగా కష్టనష్టాలకు లోనవుతూ ఉండినా, మన ప్రజానీకాన్ని కలయగట్టి ఉంచిన ఐక్యత ఆ వైవిధ్యం వెనుక ఉండనేవున్నది. భౌతిక, సాంకేతిక విజ్ఞాన మయమైన నూతన ప్రపంచములోనికి మనం చొరబడుచున్నాము. ప్రకృతి శక్తులను నానాటికి మనకు వశపరచే శాస్త్రసాధనలను మనం చేస్తున్నాము. కాని మన దారిద్ర్యమే మన కృషికి అడ్డుగా ఉన్నది. పైగా తగినంత అభివృద్ధి లేకపోవడమూ, పాత సంప్రదాయాలను పట్టుకుప్రేలాడడమూ కూడా మనకు అవరోధంగా ఉన్నవి. ప్రకృతి శాస్త్రజ్ఞానమూ, సాంకేతిక విద్యా అలవరచు కోకపోతే మనకు భవిష్యత్తు లేదు. అయితే భూతకాలాన్ని అలక్ష్యం చేసినా, విస్మరించినా, మన భవిష్యత్తు నిస్సారమూ అర్థవిహీనమూ కాకతప్పదు.

# 4

భవిష్యత్తు ముందుకూ భూతకాలం వెనుకకూ రెండువైపులా మనలను లాగుతూ ఉంటే కల్లోలపూరితమైన వర్తమానంలో మనము నిలిచి ఉన్నాము. ఈ వైరుధ్యాన్ని మనం ఏవిధంగా పరిష్కరించగలం? మన భౌతికావసరాలను సమకూరుస్తూ, మానసికంగానూ ఆధ్యాత్మికంగానూ మనకు శక్తినివ్వగల జీవిత ప్రణాళికను ఏవిధంగా రూపొందించగలం? క్రొత్తవో ప్రాతవో, ఈ నూతన ప్రపంచానికి తగినట్లుగా వివిధాదర్శాలను ఏ విధంగా ప్రజల దృష్టికి తెచ్చి, ప్రజలలో జాగృతినీ కార్యపరత్వాన్నీ పురికొల్పగలం?

భారతదేశంతో మన ప్రత్యేక సమస్యలు మనకున్నవి. అయితే, ప్రపంచం తాలూకు ప్రధాన సమస్యలలో కూడా భాగం పంచుకోనక తప్పదు. ఆ ప్రపంచం ప్రచండంగా ముందుకు సాగిపోతున్నది. కాని ఆత్మవిశ్వాసాన్ని కోల్పోతున్న సూచనలు కనిపిస్తున్నవి. ప్రస్తుతం మనము ఆర్థిక పురోగమనంలో, పంచవర్ష ప్రణాళికలలో నిమగ్నులం కావడం సమంజసమే. ప్రజానీకపు జీవనప్రమాణాన్ని పెంపొందించడానికి తీవ్రకృషి జరుగుతున్నది. ఈ ప్రయత్న మంతా ఏవిధమైన పురోభివృద్ధికి గాని అవసరమే. అయితే ఒక సంశయం మనస్సులను ఆవేశిస్తున్నది. ఈ ప్రయత్నాలు మాత్రమే చాలునా ? వీటికితోడుగా వేరే ఏదైనా శోధించడం అగత్యమా ? సంక్షేమరాజ్య ప్రతిష్ఠాపన యోగ్యమైన ఆదర్శమే. కాని ఆచరణలో అదికూడా నిస్సారమే కావచ్చును. ఆ లక్ష్యాన్ని అందుకున్న రాజ్యాలలో నూతన సమస్యలూ, క్లిష్టపరిస్థితులూ ఏర్పడడం మనం చూస్తూనే ఉన్నాము. ఆ విధంగా వచ్చిన సమస్యలు కేవలం భౌతిక పురోభివృద్ధివల్లనూ యాంత్రిక నాగరకతవల్లనూ పరిష్కారమయ్యేవి కావు. మానవ తత్త్వానికి అగత్యమైన కొన్ని ప్రయోజనాలను సమకూర్చడంలో మతం ప్రధాన సాధనమైనది. కాని నేడు అట్టి మతానికి సంఘంపైన ప్రాబల్యం సడలినది. ప్రకృతివిజ్ఞాన ప్రభావాన్నీ హేతువాదాన్నీ ఎదుర్కోవడం ఈనాటి మతానికి సాధ్యంకావడంలేదు. మతం అగత్యమైనా కాకపోయినా, మన జీవితాలను సారవంతం చేయడానికీ, మనలను ఏకంగా నిలిపి ఉంచడానికీ, ఒక యోగ్యమైన ఆదర్శంమీద శ్రద్ధాభక్తులుండడం మాత్రం అగత్యమే. మన దైనందిన జీవితాలకు చెందిన శారీరక ఆర్థిక అవసరాలను మించిన పరమ ప్రయోజన మేదో ఉన్నదనే భావం మనకు తప్పకుండా ఉండవలెను. అట్టి దృష్టిని కల్పించడానికై సోషలిజమూ, కమ్యూనిజమూ ప్రయత్నిస్తున్నవి. కాని ఆ 'యిజము' లకు ఏవో సిద్ధాంతాలను పెంపొందించడమే పనిగా ఏర్పడినది. కమ్యూనిస్టులు నేడు తత్త్వవేత్తలైనారు.

ప్రతి సంఘమూ ఒకవిధమైన స్థాయీభావాన్ని సాధించడానికి ప్రయత్నం చేస్తుంది. ఒకప్పుడది సంఘర్షణ ద్వారా సాగవచ్చు. ఇంకొకప్పుడు వ్యక్తంగానో అవ్యక్తంగానో ప్రయత్నపూర్వకంగా జరుగవచ్చు. అంతగా నూర్పుచెందక ప్రాథమికదశలోనే ఉన్న సంఘం ఒకే గాడిలో జీవితం సాగిస్తూఉంటుంది. ఆ సంఘానికి స్థాయీభావం క్రిందిమెట్టులోనిదే లభిస్తుంది. పురోగామి యైన

సంఘం వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ ఉద్రేకాలను కల్పించుకుంటుంది. ఇది నిజమే అయితే, నేటి ప్రపంచంలో వ్యక్తమయ్యే ఉద్రిక్తస్థితి ఏదో ప్రచండ శక్తి యొక్క విజృంభణకు చిహ్నంగా భావించవలసిఉంటుంది. అనగా నూతన మైన సమత్వ స్థితికిన్నీ, మానవ జీవితంలో నూతనస్థాయికిన్నీ దీనికొక సాధనగా గ్రహించాలి. అణ్వస్త్రయుగంలో నిర్మించబడుతున్న మారణసామగ్రి మానవ జాతిని నిర్మూలంకావిస్తుందేమోననే భీతి నిరంతరంగా మనలను వెంటాడని పక్షంలో, ఈ శక్తి విజృంభణ మనకు ఉత్సాహకారణమే కావలెను.

మనం మన భావిస్థితిపై దృష్టి సారించాలి. దానికై ప్రయోజనకరంగా శ్రద్ధాభక్తులను వినియోగించి కృషిచేయాలి. దానితోపాటు, మనకు సంక్రమించిన పూర్వ సంస్కృతిని నిలుపుకుంటూ తద్వారా బలాన్ని సంపాదించుకోవాలి. భూత వర్తమానాల మీద ఆధారపడి భవిష్యత్తును నిర్మించుకోవాలి. గతానికి పూర్తిగా స్వస్తి చెప్పడమంటే, కాళ్లక్రింద గోతిని త్రవ్వుకోవడమన్న మాట. మన జాతికి మన దేశానికీ చెందిన ఉత్తమసంప్రదాయాలపైన స్థిమితంగా నిలబడి విప్లవ స్థాయిలో కృషిచేయడమే గాంధీజీలోని విశిష్టలక్షణం. పెక్కుమంది ఆయనను విమర్శించారు. ఆయన స్వీకరించిన ఆర్థిక సిద్ధాంతాలు నేటి కాలానికి పనికిరావన్నారు. పూర్వ సంప్రదాయాన్ని సమర్థించడమే కాక అభ్యుదయ నిరోధక శక్తులను ప్రోత్సహిస్తున్నాడని ఆయనను ఆక్షేపించారు. కాని గాంధీజీ ప్రతిపాదించిన బహుళోద్యమముల విస్తీర్ణతను సవిమర్శకంగా గ్రహించినవారికి వాటి విప్లవాత్మక ఫలితములు తన్మయత్వాన్ని కలిగించినవి. రాజకీయరంగంలోగాని, సామాజికరంగంలోగాని గాంధీజీ చేపట్టిన ఉద్యమఫలితాలను గుర్తించడం—సంఘర్షణారూపమైన పాశ్చాత్య సంప్రదాయంలో పెరిగిన మనకు— కొంతవరకు కష్టమే. వాస్తవమైన విప్లవం ప్రజానీకంలో నుంచి వస్తుందేకాని, పై అంతస్థులోనుంచి క్రిందికిదిగివచ్చేదికాదని గాంధీజీకి తెలుసును. విప్లవం సాంఘికంగా రావడమే ప్రధానమని ఆయన గ్రహించాడు. గాంధీజీకి ముందు సమర్థులైన సంఘసంస్కర్తలు పెక్కుమంది కృషిచేసి కొన్ని స్వల్ప మార్పులను తీసుకురాగలిగినారు. లేక సంఘంలో నూతన శాఖలను నిర్మించారు. కాని లక్షలాది ప్రజల సాంసారిక జీవితంలో—వారికి పూర్తిగా అవగాహన కాకుండానే—ఒక విప్లవాన్ని, 'రామరాజ్యం' పేరిట, గాంధీజీ సాధించ గలిగారు. కుల వ్యవస్థను ఆయన పూర్తిగా నిరసించలేదు. చివరి రోజులలో

మాత్రం కులవ్యవస్థ పోవాలని కొంతవరకు ప్రచారం చేశారు. కాని అణగ ద్రొక్కబడిన వర్గాలనూ అస్పృశ్యులనూ ఉద్ధరించాలని పట్టుపట్టడంవల్ల కుల వ్యవస్థను సమూలంగా కదిలించివేశారు. రాగల ఫలితాలను గుర్తిస్తూనే మనస్ఫూర్తిగా ఆయన ఇట్టి ప్రచారానికి పూనుకున్నారు. రాజకీయోద్యమంలో గాంధీజీ అవలంబించిన పద్ధతివల్ల లక్షలాది ప్రజలు శక్తి సంపన్నులైనారు. ప్రజానీకంలో భీతిభావం పోయి, ఆత్మగౌరవమూ, ఆత్మవికాసమూ నెలకొన్నవి. సుఖపడే అవకాశాలు కొరవడి దరిద్రదశలో కృశిస్తూ ఉన్న ప్రజల పక్షాన్ని ఆయన అవలంబించడంవల్ల, సాంఘిక న్యాయాన్ని గుర్తించడం మనకు తప్పనిసరి అయినది. ఇదంతా శాంతంగా ఉద్రేకం లేకుండా చాలావరకు సంఘర్షణభావానికి తావు ఇవ్వకుండా ఆయన సాధించారు. అన్నిటికంటే ముఖ్యంగా, సత్యాన్ని పాటించాలనీ సాధనావిధానం శాంతియుతంగా ఉండా లనీ ఉద్ఘాటించారు. సత్యాన్ని జీవిత నియమంగా స్వీకరించారు. ఆయన కార్య క్రమం తీవ్రమైనా సత్యబద్ధంగా ఉండేది. గతకాలంలో మనజాతికి ప్రఖ్యాతిని చేకూర్చిన మూలసిద్ధాంతాలను ప్రజలు మరల స్మరించేటట్లు ఆయన చేశారు. ఈవిధంగా ప్రాతపునాదులమీదకట్టినా, ఆయన కావించిన నిర్మాణం భవిష్యత్తుకు ఉపకరించేదిగా ఉన్నది. ఆయన ప్రతిపాదించిన ఆర్థిక సిద్ధాంతాలూ కార్య విధానాలూ కొన్ని ఆధునిక భావాలకు అనుకూలించేవికావనీ, తాత్కాలిక ప్రయోజనానికిమాత్రమే తగినవనీ, ఆయన కలవరంచెందేవారుకారు. మూల సిద్ధాంతాలకు ప్రమాదంలేని విధంగా, పరిస్థితుల మార్పులకు అనుగుణంగా తన కార్యక్రమాన్ని సరిదిద్దుకోడానికి ఆయన ఎల్లప్పుడూ సంసిద్ధులై ఉండేవారు.

గతాన్ని వర్తమానంతోనూ భవిష్యత్తుతోనూ ఆయన సమన్వయపరచడం చూస్తే నాకు ఆశ్చర్యం కలిగేది. ఆయనకది సాధ్యంకావడంవల్లనే ఎడతెగకుండా క్రమక్రమంగా ప్రజలను ముందుకు నడపగలిగారు. చాలావరకు సంఘర్షణకు అవకాశం కలగకుండా చేశారు. ఆయన మనకు బోధించి, ఎప్పటికప్పుడు జ్ఞప్తికి తెస్తూవుండిన సూత్రాలలో మరీ ప్రాణపదమైనది సాధనమార్గాల ప్రాముఖ్యత. మనం పాటించవలసింది కేవలం లక్ష్యమే కాదు. మన లక్ష్యానికి ఆకారాన్ని కల్పించేది మన మవలంబించే కార్యవిధానమే. ఈ సిద్ధాంతంలోనూ, దానిని ఆచరణలో పెట్టడానికి ఆయన అనుసరించిన పద్ధతిలోనూ, ఏ మాత్రమైనా సత్య మనేది ఉన్నట్లయితే, మనంకూడా ఆయనవేసిన పునాదులమీదనే భవిష్యత్తును

నిర్మించాలి. అంతే ఆయన చెప్పిన ప్రతి మాటనూ, చేసిన ప్రతి పనినీ మనం బానిసతనంగా అనుసరించవలెనని కాదు. మనంకూడా పరిస్థితుల మార్పును గమనిస్తూ వాటికి తగినట్లుగా ప్రవర్తించాలి. కాని ఆ మూలసిద్ధాంతాలే మనకు మార్గదర్శకంగా ఉండాలి.

# 5

రాజకీయ ఆక్రమణరూపంగా భారతదేశానికి వచ్చిన ఇస్లాంమతం ఒక సంఘర్షణను కూడా ప్రవేశ పెట్టినది. దాని ఫలితం రెండు విధాలుగా పరిణమించినది. ఒకవైపున హిందూసంఘం అంతకుపూర్వముకన్న అధికంగా తనలో తాను కుంచించుకు పోసాగినది. ఇంకొకవైపున ఇస్లాం ఒకవిధమైన నూతన వాతావరణాన్నీ, భావాలనూ తీసుకువచ్చినది. అందువల్ల ఉత్తేజకరమైన ప్రభావం కలిగింది. భారతీయ విజ్ఞాన ఫలితమే అయిన బౌద్ధమువలె కాక, హిందూసంఘం ఒక సంకుచిత వ్యవస్థగా రూపొందియుండెను. బయటినుండి వచ్చిన ముస్లిములది కూడా సంకుచిత వ్యవస్థే. ఈ విధంగా రెండు సంకుచిత వ్యవస్థలకు సంపర్కం కలిగినది. ఒకదాని నొకటి సమూలంగా పెరికివేయడానికి గాని, అణగద్రొక్కడానికి గాని దేనికీ బలం చాలిందికాదు. ముస్లిములు భారతదేశాన్ని రాజకీయంగా జయించగలిగారు. కాని ఈ విజయం వైజ్ఞానిక, నైతిక, ధార్మిక విజయానికి దారితీయలేదు. ప్రాచీన భారత సంప్రదాయంలోనూ, మతంలోనూ బలమూ, దార్ఢ్యమూ ఇంకా నిలిచి ఉండడమువల్ల క్రొత్తగా వచ్చిన వత్తిడిని నిరోధించగలిగినవి. కాని ముస్లిములకు కూడా స్వకీయమైన బలవత్తర సందేశం ఉండినది. అందువల్ల అంతకుముందు వచ్చిన జాతులను లీనం చేసుకున్న విధంగా ముస్లిములను కూడా లీనం చేసుకోవడం సులభసాధ్యం కాలేదు. భారతప్రజల మూలతత్వాన్ని మార్చడం ముస్లిములకు సాధ్యం కాలేదు. బలీయములైన రెండు సంకుచిత వ్యవస్థలమధ్య సామరస్యసంబంధాలు ఏర్పరచడం ఎలాగు అన్నదే మధ్యయుగంలో భారతదేశాన్ని ఎదుర్కొన్న ప్రధాన సమస్య. అక్బరువంటి వివేకశీలురైన చక్రవర్తులూ, తదితరులూ, ఏదో

ఒక విధమైన సామరస్యమును నెలకొల్పడమే దేశభవిష్యత్యానికి అగత్యమన్న ఆశతో కృషిచేశారు.

ప్రాచీన హైందవులు తాత్విక సిద్ధాంతంలోనూ, లౌకికదృష్టిలోనూ వ్యక్తపరచిన సహనగుణం ఆశ్చర్యకరమైనది. కాని హైందవసంఘం లెక్కించ రాని ప్రత్యేక కులాలక్రింద నిమ్నోన్నత తరగతులుగా విభక్తమై ఉండినది. పరాయివాళ్ళతో సమాన ప్రతిపత్తిలో జీవించడం ఏలాగు అన్నది ముస్లిములకు ఒక సమస్యగా ఏర్పడినది. అంతకుపూర్వం ముస్లిములు జయించిన దేశాలలో తమ విజయప్రాబల్యం అధికతరం కావడంచేత, హాస్తవానికి ఇటువంటి సమస్య పుట్టనేలేదు. క్రైస్తవదేశాలతో ముస్లిములకు సంఘర్షణ కలిగినది. వందల సంవత్సరాలు గడిచినా ఈ సమస్య ఏనాటికీ పరిష్కారపు కాలేదు. భారత దేశంలో నెమ్మదిగా ఒక విధమైన సమన్వయం రూపొందినది. ఆ సమన్వయం పరిపూర్ణం కాకముందే ఇతర పరిస్థితులు ఏర్పడినవి. పారిశ్రామికంగా అభివృద్ధి పొంది బలపడిన పాశ్చాత్యజాతులు తక్కినజాతులకన్న తామే అధికులమన్న భావాన్ని పెంపొందించుకున్నవి. తక్కిన జాతులకు దూరంగా ఉంటూ, తమ ఏలుబడిలో నున్న ప్రజలను హీనంగా చూడడం వారికి ఆచారమైనది. హిందూ ముస్లిముల మధ్య ఏనాడుగాని ఏర్పడనంత అగాధం పాశ్చాత్య పాలకజాతులకూ భారత జాతులకూ మధ్య ఏర్పడినది.

తొలిసారిగా భారతదేశం వలస పరిపాలనకు వశమైనది. ఎంతో దూరంలో ఉన్న జాతి భారతదేశంపైన ప్రభుత్వం వహించింది. అంతకు పూర్వం భారత దేశంమీద దండెత్తిన జాతిగాని జయించిన జాతిగాని, ఇక్కడ స్థావరం ఏర్పరుచు కున్న తరువాత ఇంకొకదేశం తమ జన్మస్థానమన్న భావం లేకుండా, ఇదే తమదేశ మని పాటించి భారతజాతిలో లీనమైనారు. కాని తరువాత వచ్చినవారి తత్వం అందుకు భిన్నమైనది. ఆ జాతి భారతదేశంలో నాటుకుపోవడం సాధ్యంకాలేదు. ఆ జాతికిన్నీ ఈ దేశంలో ఉండిన హిందూముస్లిము తదితర జాతులకున్నూ మధ్య భేదింపరాని అడ్డుగోడ ఏర్పడినది.

అయినా, పాశ్చాత్యుల స్వేచ్ఛాభావాలునూ, పారిశ్రామికాభివృద్ధియూ భారత జాతి స్వభావం మీదా జీవితం మీదా పనిచేయ నారంభించినవి. ఒక నూతనమైన జాతీయభావం వృద్ధిపొందినది. ఆ భావమే అనివార్యంగా వలస ప్రభుత్వం యొడల వైముఖ్యాన్నీ స్వాతంత్ర్య కాంక్షనూ కలిగించినవి. నూత

నంగా వచ్చిన పారిశ్రామిక నాగరకతా, భాషా సారస్వతములూ, పాశ్చాత్య జీవిత పద్ధతులూ, మన జాతీయ భావానికి దోహదం చేసినవి. కాని ఆ భావం దేశంలోని పై తరగతి పౌరలోనే వికసించింది. క్రింది తరగతుల ప్రజలు ఇంకా ఘోర దారిద్ర్యంలో క్రుంగిపోయినారు.

ప్రాచీన భారతానికీ నవీన మార్గాలకూ ఒక విధంగా సామరస్యాన్ని కల్పించుటకు రామమోహనరాయలు ప్రయత్నించారు. వివేకానందుడు ప్రాచీన భారత తాత్విక సిద్ధాంతాలలోని శక్తిని పునరుద్ధరిస్తూ, వాటికొక నూతన రూపాన్ని సరిదిద్దినాడు. రాజకీయ, సాంస్కృతిక, ఉద్యమాలు విస్తరించి గాంధీ రవీంద్రులలో పరిణతి పొందినవి.

యూరపులో సాంప్రదాయిక మతానికీ ప్రకృతి విజ్ఞానానికీ తీవ్ర సంఘర్షణ జరిగింది. క్రైస్తవమతం నిర్వచించిన ప్రపంచ స్వరూపం ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాలకు బొత్తుగా అనుకూలించలేదు. భారత దేశంలో ప్రకృతి శాస్త్ర విజ్ఞానానికీ భారతీయ తాత్విక విజ్ఞానానికీ అట్టి సంఘర్షణ కలగలేదు. ఇక్కడి తాత్విక విజ్ఞానం, తన మూలసూత్రాలకు భంగం కలుగని విధంగా ప్రకృతి విజ్ఞానాన్ని స్వీకరించడానికి అవకాశం చేసుకున్నది. కాని ఇచ్చటి సాంఘిక వ్యవస్థకూ నూతన పరిస్థితులకూ పొత్తు కుదరకపోగా, అంతకంతకు వైమనస్యం పెరిగినది.

ఇతర దేశాలలోవలెనే, భారతదేశంలో కూడా రెండు విభిన్న శక్తులు విజృంభించినవి. ఒకటి జాతీయభావోన్మీలనా, ఇంకొకటి సాంఘికన్యాయస్థాపనా వశ్యకతా. సాంఘికన్యాయ ప్రేరణకు చిహ్నములుగా సోషలిజమూ మార్క్సిజమూ ఏర్పడినవి. వాటి శాస్త్రీయ స్వరూపం ఏలా ఉండినా, అవి సామాన్య ప్రజానీకాన్ని అధికంగా ఆకర్షించి వారిని భావవివశులను చేసినవి. యూరపు పడమటిభాగంలో, పారిశ్రామిక అభివృద్ధి కలిగిన ప్రథమ దశలో, ఘోరపరిస్థితులు ప్రసరించిఉండెను. ఇవే ప్రధానంగా మార్క్సుకు భావసంచలనం కలిగించినవి. ఆ కాలంలో ఏ రాజ్యానికి గాని నిజమైన ప్రజాస్వామ్య నిర్మాణం లేదు. ఆ కారణంవల్ల, ఏ మార్పు తీసుకురావడానికైనా హింసాయుతమైన విప్లవమే ఏకసాధనంగా ఏర్పడినది. కాబట్టి హింసాత్మక విప్లవ దృష్టితో ఆలోచించడమే మార్క్సిజముకు తప్పనిసరిఅయినది. అసలు యూరపు సంప్రదాయం కూడా ఆ మార్గంలోనే ఉండినది. అయినా, అటుతరువాత రాజకీయంగా ప్రజా

స్వామ్యం వ్యాప్తి నిపొందినది. శాంతియుతంగా మార్పు కావించడం సాధ్యమైనది, పైగా, ప్రకృతి విజ్ఞానమూ, సాంకేతిక ప్రతిభా విస్తరించి సార్వజనికమైన భౌతిక సంపత్తిని సమకూర్చినవి. పెట్టుబడి విధానపు మూలతత్వం ఇంకా నిలిచి యుండి, తమ ఆర్థిక ప్రాబల్యంవల్ల కొలదిమంది సంపత్తిని గుత్తగొని తమ స్వాధీనంలో పెట్టుకోవడం జరుగుతూనేఉన్నప్పటికీ, ఆ విధానం మాత్రం చాలా మార్పుచెందినది. రాజ్యాంగం ప్రజాస్వామికం కావడమూ, శ్రామికసంఘాలు నిర్మాణంకావడమూ, అన్నిటికన్న ముఖ్యంగా సాంఘిక న్యాయానికి ప్రాబల్యం కలగడమూ, ప్రకృతి విజ్ఞానమూ సాంకేతిక విజ్ఞానమూ అభివృద్ధిపొందడమూ, ఈ పరివర్తనానికి దారితీసినవి. ఈనాడు పెట్టుబడి విధానం నిలిచియున్న దేశాలలో సార్వజనికంగా జీవనప్రమాణం చాలా వృద్ధిపొందడం మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాము.

సోవియట్ యూనియన్ కూడా చాలా స్వల్పకాలంలోనే భౌతికసంపదనూ సాంకేతికాభివృద్ధినీ ప్రచండంగా సాధించిన విషయం మనకు తెలిసినదే. ఇదంతా చాలవరకు హింసవల్లనే సాధించబడినదనడం వాస్తవంకాదు. ఇతర వ్యవస్థలలోనూ కావలసినంత హింస లేకపోలేదు. కాని అక్కడి పరిస్థితులనుబట్టి అధికంగా హింసాకాండ, వ్యతిరేకుల విధ్వంసమూ జరిగిన సంగతి వాస్తవమేనని నా నమ్మకం. కాని ఈ హింసాకాండను సోవియట్ యూనియన్‌లోని ఉత్తమ నాయకులే అధికంగా విమర్శించి, నిరసించినారు.

# 6

పశ్చిమరాజ్యాలకూ కమ్యూనిస్టు రాజ్యాలకూ— ముఖ్యంగా అమెరికా రష్యాలకు— మధ్య ఏర్పడిన సంఘర్షణ నేటి అంతర్జాతీయ వ్యవహారాలపై అధిక ప్రభావం వహించినది. ఈ రెండు అగ్రరాజ్యాల మధ్య అనేక విభేదాలు స్పష్టంగా కనుపించినా, వాటికి ఆశ్చర్యకరమైన సామ్యం కూడా ఉన్నది. రెండూ పారిశ్రామిక, యాంత్రిక నాగరకతను మిక్కుటంగా పెంచుకున్నవి. దినదిన ప్రవర్ధమాన మవుతున్న యాంత్రిక శక్తి వల్లనే మానవుల సమస్యలు

పరిష్కారం కాగలవన్న నమ్మకం రెంటికీ ఉన్నది. రెండు రాజ్యాల ప్రజలూ ఇతరులపట్ల స్నేహభావాన్నీ ఆదరణనూ పాటిస్తున్నారు. ఉభయులూ శాంతినే వాంఛిస్తున్నారు. ఈనాడు నిజమైన వ్యత్యాసం, ఒకవైపు బాగా వృద్ధిచెందిన రాజ్యాలకూ, మరొకవైపు ఇంకా క్రింది మెట్టులోనున్న రాజ్యాలకూ మధ్య ఏర్పడినదే. వైజ్ఞానిక పారిశ్రామికాభివృద్ధివల్లనే తాము ఏవిధంగానైనా ముందుకు రాగలమనీ, ఈనాడు తాము అనుభవిస్తున్న ఘోర భౌతికబాధలను నివారించుకోగలమనీ, క్రింది మెట్టులోనున్న రాజ్యాలకు తెలిసివచ్చినది. ఈ లక్ష్యంతోనే వారు కృషిచేస్తూ కొద్దో గొప్పో విజయాన్ని సాధిస్తున్నారు. ఈ కృషి కష్టసాధ్యమైనది. యూరపులో నిజమైన రాజకీయ విప్లవం వచ్చేలోపు గానే ఆర్థిక పరివర్తనంవల్ల కొంత సాధన సంపత్తి సిద్ధంగా ఉండినది. ఆసియా ఖండంలో రాజకీయ విప్లవమే ముందుగా వచ్చినది. సాంఘికాభ్యుదయం అగత్యమన్న భావం అటుతరువాత వచ్చినది. కాని, ఆర్థికంగా వెనుకబడి ఉండడం వల్లనూ, సాధన సంపత్తి కొరవడి ఉండడంచేతనూ, సాంఘికాభివృద్ధిని సాధించడం సులభం కాకపోతున్నది. ఇదివరకే పారిశ్రామికంగా ఉన్నతస్థితికి వచ్చి, భారీగా వస్తూత్పత్తి చేసుకొనుటకు కావలసిన సామగ్రిని సిద్ధపరచుకున్న దేశాల సమస్యలకున్నూ తక్కువ స్థితిలో ఉన్న దేశాల సమస్యలకున్నూ చాలా వ్యత్యాసం ఉన్నది. యూరపు అమెరికాలను పారిశ్రామికంగా ఉత్తమ స్థితికి తెచ్చిన దీర్ఘకాలపు విధానాలను ఈ తక్కువ మెట్టులోని దేశాలు అనుసరించుట అసంభవమని మనకు తెలుసును. ప్రజల వాంఛలను కొంతవరకైనా వెంటనే సంతృప్తిపరచని పక్షంలో రాజ్యాంగ నిర్మాణమే తలక్రిందులు కావచ్చునన్నంత వత్తిడి తెరిపిలేకుండా సంఘంలో హెచ్చుహెచ్చిగిపోతున్నది. ఒక వైపున జనసంఖ్య దినదినాభివృద్ధి పొందుతున్నది. ఈ పెంపకంతో, అధికంగా ఉత్పత్తి అయిన పదార్థమంతా హరించిపోతున్నది. పురోభివృద్ధికై పెట్టుబడికి గాని, నిలవ చేసుకొనుటకు గాని, అవకాశం లేకుండా పోతున్నది. కాబట్టి పెట్టుబడికీ, అధిక వస్తూత్పత్తికీ అదనంగా ద్రవ్యాన్ని సమకూర్చడం ఏలాగనేదే అధోగతిలో దారిద్ర్య మనుభవిస్తున్న దేశానికి ప్రధాన సమస్య. అందుకై కావించే ప్రతి ప్రయత్నమూ ప్రజాసామాన్యంమీద అధికమైన భారం మోపడమైనది. కాని, ప్రస్తుతం మోస్తున్న భారంనుంచి విముక్తి కావాలని ఆ ప్రజలే ఘోషిస్తున్నారు.

నిర్బంధ విధానాలను ఆచరణలో పెట్టవచ్చును. కాని భవిష్యత్తులో ఏదో లాభం కలుగుతుందనే ఆశ లేకపోతే ప్రజానీకంపైన నిర్బంధాన్ని ప్రయోగించడంవల్ల అంతగా ప్రయోజనం లేదు. అసలుసంగతి ఏమిటంటే, ఏసందర్భంలో గాని అధిక కృషికి కావలసిన ప్రోత్సాహమును కల్పించాలి. భవిష్యత్తుపై ఆశను ప్రజలకు అందించగల, ఫలప్రదమైన, లక్ష్యాన్ని వారి ముందు పెట్టవలెను. ఆ భవిష్యత్తు కూడా ఎన్నడో అతి దీర్ఘకాలంలో వచ్చేదిగా ఉండకూడదు. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలను అధికమైన కృషికి సిద్ధపరచాలంటే, వారికి ఆశనూ ఉత్సాహాన్నీ కల్పించాలి. క్రమంగా సమస్థితి బాగుపడుతుందన్న నమ్మకాన్ని కలిగించాలి.

తగినంతగా అభివృద్ధి చెందని దేశాలలో పెక్కింటికంటె, భారతదేశం బహుశః కొంత నయమని చెప్పవచ్చు. గడచిన కొద్ది సంవత్సరాలలో పారిశ్రామికాభివృద్ధికి పునాదులను నిర్మించడమూ, వ్యవసాయకృషిని పెంపొందించడమూ, విద్యనూ ఆరోగ్యాన్నీ విస్తరింపచేయడమూ మొదలైన విషయాలలో భారతదేశం పురోగమించిందని నిర్దిష్టంగా చెప్పవచ్చు. స్వాతంత్ర్య సంపాదనకు కారణభూతమైన జాతీయోద్యమం ఆదర్శాలనూ లక్ష్యాలను క్రమశిక్షణనూ సమకూర్చినది. వీటి ప్రయోజనం మనకు సంక్రమించడమే అన్నిటికన్న గొప్ప విషయం.

నేటికిన్నీ ఆసియాలో జాతీయ భావమే ప్రబలశక్తిగా ఉన్నది. దీని విస్తరణ నిత్యమూ ప్రత్యక్షంగా గోచరిస్తున్నది. యూరపులో కూడా జాతీయ భావం అంతకంతకు అధికంగా వ్యక్తమవుతున్నది. ఈ జాతీయభావమే ఫాసిజం నాజిజం పేరులతో భయంకరాకృతి తాల్చినది. వాటి భయం తొలగినా, వాటి తీవ్రతకు తగ్గుస్థాయిలో, ప్రబలమైన మరొకరకం జాతీయభావం అవతరించి నేటికీ పెక్కు దేశాలలో కార్యవిధానాలను నడుపుతున్నది. దీని ప్రభావం కొద్దిగానో గొప్పగానో యూరపులోని పెక్కు దేశాలలో కనబడుతున్నది. దీనితోపాటు ఒక వ్యతిరేకమైన ప్రభావం కూడా బయల్పడినది. దానిని "జాతీయాతీత ఐక్యత" (Supra - national unity) అనవచ్చును. దాని ప్రభావంవల్లనే వేర్వేరు దేశాలమధ్య వ్యాపారంలోనూ, అనేక సాముదాయిక సంస్థలలోనూ ఏకత్వాన్ని నెలకొల్పవలెనన్న ప్రయత్నాలు యూరపుదేశాలలో సాగుతూ ఉన్నవి.

కమ్యూనిస్టుదేశాలలోనూ జాతీయభావం విస్పష్టంగా గోచరిస్తుంది. సోవియట్ యూనియన్ అధికంగా మార్క్సిస్టు భావాలవల్లనూ, తరువాత సంక్రమించిన అందరి మార్పులవల్లనూ రూపొందినది. కాని అక్కడకూడా బలమైన జాతీయభావం పాదుకొన్నది. ప్రాచ్య యూరపు దేశాలలో జాతీయభావ ప్రాబల్యం ప్రత్యక్షంగా కనబడుతూనే ఉన్నది. చైనాలోకూడా కమ్యూనిజం జాతీయతత్వం మీదనే ఆధారపడి యున్నది. కమ్యూనిజం ఎక్కడ ఆచరణలో ఉన్నా, దాని బలం కొంతవరకు జాతీయతత్వంతో మిశ్రితం కావడంలోనే ఉన్నది. ఈ రెంటినీ విడదీసేపక్షంలో కమ్యూనిజం బలం కొంత సన్నగిలిపోతుంది. దీనికి మినహాయింపు ఉన్నది. తక్కువ స్థాయిలోనే ఉండి, దారిద్ర్యపీడితములైన దేశాలలోని అసంతృప్తిని మాత్రమే కమ్యూనిజం రూపొందించగలిగి ఉంటుంది.

ఇప్పటికీ పరాయి ప్రభుత్వాలక్రింద ఉన్న దేశాలలో జాతీయోద్దీపన తప్పనిసరిగా స్వాతంత్ర్య సంఘర్షణగా పరిణమిస్తుంది. బలీయములైన స్వతంత్ర దేశాలలో జాతీయోద్దీపన రాజ్య విస్తరణోద్యమంగా పరిణమిస్తుంది. ఈ పరిణామాన్ని నిరోధించే శక్తులుకూడా స్వతంత్రదేశాలలో కొంతవరకైనా వ్యాప్తిలోనున్నవి.




## 7

యూరపులోనూ, ఇతర దేశాలలోనూ విశాలమైన ఏకీకరణ భావాలకూ, విచ్ఛిన్నాత్మకమైన సాంప్రదాయిక జాతీయభావాలకూ ఈనాడు జరుగుతున్న పోరాటం చూస్తూనే ఉన్నాము. ప్రకృతిశాస్త్రంలోనూ, సాంకేతికసాధనలోనూ అభివృద్ధి కలగడమూ, ముఖ్యంగా రవాణా సౌకర్యాలు వృద్ధిపొందడమూ ఏకీకరణశక్తిని అంతకంతకు ప్రబలం చేయుటకు కారణములైనవి. ఇతర విషయాలలో వలెనే, ఏకీకరణ కార్యంలోకూడా ఆధునిక జీవితానికి మూలాధారమైన ప్రకృతివిజ్ఞానం అంతిమవిజయం పొందగలదని మనం ఊహించవచ్చు. అయితే జాతీయసంఘర్షణల మూలంగా యుద్ధాలు సంభవించడమే అపాయస్థితి.

ఈనాడు ప్రపంచంలో ప్రాధాన్యం వహించిన విభిన్న ఆదర్శవాదాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం సాగుతున్నందున, ప్రత్యక్షసమరం సంభవించే అవకాశం అధికమవుతున్నది. ఆదర్శవాదాల మధ్యనే సాగుతున్నట్లు మనం ఊహిస్తున్న సంఘర్షణకు వెనుకగా, అగ్రరాజ్యాల రాజకీయస్పర్ధలు తొంగి చూస్తున్నవి. అగ్రరాజ్యాలు పరస్పరమైన భీతితో వ్యవహరిస్తున్నవి. కమ్యూనిస్టు రాజ్యాలకూ, ఇతర రాజ్యాలకూ దృక్పథంలోనూ, ఆర్థిక సిద్ధాంతాలలోనూ మూలకందములైన విభేదాలున్నవి. అట్టి విభేదాలే స్వేచ్ఛారతిలో, రాజ్యాంగతంత్ర నిర్మాణ విషయములో, కూడా ప్రబలంగా ఉన్నవి. ఈ విభేదాలు ఇప్పటికే కొంతవరకు సన్నగిలినవి. ఇంకా సన్నగిలవచ్చుకూడా. ఈ రెంటిమధ్య నున్న అగాధం ఎంత లోతుగా, వెడల్పుగా కనుపిస్తున్నా, క్రమంగా తగ్గిపోవచ్చు. మానవజీవితాన్ని మారుస్తూ ఉన్నది కేవలం ఆదర్శవాదాలే కాదు. అంతకన్న అధికంగా వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధులే మార్పును తెస్తున్నవి. ఇవి నిరంతరంగా సాంఘిక ఆర్థిక వ్యవస్థలను రూపొందిస్తున్నవి. నైజధర్మాన్ని అనుసరించే, ఆకృతి ఏర్పడుతుంది. శిల్పనిర్మాణానికి ఈ సూత్రమే వర్తిస్తుంది. అసాంతానికి సాంఘికనిర్మాణం కూడా అంతే. సంఘ స్వరూపం సంఘ ధర్మానికి అనుగుణంగానే ఉంటుంది. ప్రకృతిశాస్త్రములూ సాంకేతిక నైపుణ్యములూ ఎడతెగకుండా మానవధర్మాలను మార్చివేస్తున్నవి. ఆ మార్పుల ననుసరించి సంఘ స్వరూపం కూడా మార్పుచెందక తప్పదు.

కాబట్టి ఆధునికజీవితములో ప్రధానమైనదీ విప్లవహేతుకమైనదీ ఒకానొక ఆదర్శవాదమే కాదు. సాంకేతికాభివృద్ధి ప్రధానం. సాంకేతిక పరివర్తనం మందంగా సాగే ప్రదేశాలలో ప్రాచీనవ్యవస్థలు నిలిచేఉంటవి. అభివృద్ధిచెందక వెనుకబడియున్న సంఘంలో వ్యవస్థలన్నీ వెనుకబడిఉంటవి. ఆధునికమైన ప్రకృతిశాస్త్ర యుగానికి అనుగుణంగా సంఘం రూపొందడానికి ఆ పురాతన వ్యవస్థలే అడ్డంకులు కాగలవు. అయితే జీవితంలో వాస్తవ విషయాలను కాదనడం అసాధ్యం. మార్పురాక తప్పదు. ఒకప్పుడు ఆ మార్పు ఆకస్మికంగా కలుగుతుంది. తారుమారుచేస్తుంది. అట్లుకాకపోయినా, కొంత నెమ్మదిగానైనప్పటికి మార్పు వచ్చితీరుతుంది.

వయోజన వోటింగు పద్ధతీ, ఏదో ఒకరకమైన పార్లమెంటరీ ప్రభుత్వమూ ఉన్న ప్రజాస్వామిక సంఘంలో, సంఘ ధర్మాలనూ, కొంతవరకు సంఘస్వరూపాన్నీ సవ్యంగా మార్పుచేయగలసాధనాలు కల్పించబడినవి. కాని చిరకాలంగా

పాతుకుపోయిన వ్యవస్థలూ, సంపదను వశపరుచుకున్న వర్గాలూ— పరిస్థితుల ఫలితంగా మార్పు నెత్తిమీదికి వచ్చిపడేవరకూ— దాన్ని నిరోధిస్తూనేఉంటవి. మతంలోగాని, ఆర్థిక సాంఘిక వ్యవస్థలలో గాని ఏ మార్పు కావలెనన్నా ఈ "మూలబలం" దానిని నిరోధించడం ఎల్లప్పుడూ జరుగుతూనేఉంటుంది.

# 8

జీవితమంటే నిరంతరంగా మారుతూఉన్న పరిస్థితులకు అనుగుణంగా, సర్దుకుపోవడమే. ప్రతి రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలోనూ ఒకవిధమైన క్రమశిక్షణ ఉంటుంది. అలాగే మతంలోనూ సాంఘికాచారంలోనూ ఒక నియమము ఉంటుంది. వీటిలో కొంత ఆధ్యాత్మిక నైతిక నియమాలు లీనమైఉంటవి. ధర్మాలూ వ్యవస్థలూ మారినప్పుడు ప్రాత నియమాలు సడలి వాటి స్థానంలో క్రొత్త నియమాలు నెలకొంటవి. గడచిన అర్ధశతాబ్దంలో, తీవ్రగమనంతో సాగిన సాంకేతిక పరివర్తనంవల్ల, సాంఘిక పరివర్తనం, అంతకు ముందెన్నడూ కానంతగా, ఎక్కువ అగత్యమైనది. నిత్యమూ సరిపెట్టుకుంటూ సర్దుకుపోవడంలో మార్పు క్రమరహితంగా జరిగినది. పూర్వకాలంలో జీవితం నిరాడంబరంగానూ, ప్రకృతితో సన్నిహితంగానూ, గడిచిపోయేది. ఆలోచనకూ ధ్యానానికీ అవకాశం ఉండేది. ఈనాడు జీవితం అంతకంతకు క్లిష్టమయిపోతున్నది. నెమ్మదిగా ఆలోచించడమనేది క్రమంగా సన్నగిలుతున్నది. ఏమైనా కొంత విశ్రాంతి లభించినా, దానిని ఏలావినియోగించుకోవడమో తెలియదు.

అభివృద్ధిపొందిన దేశాలలో విశ్రాంతిని ఏలా వినియోగించుకోవలెనన్నది క్రమేణా పెద్ద సమస్యగా పరిణమించినది. అయినా, నేడుగాని మనం ఊహించతగినంత భవిష్యత్తులోగాని, ఈ సమస్య భారతదేశానికి సంక్రమించేదికాదు. ప్రకృతినుంచి వైదొలగి కృత్రిమ మార్గాలపైన ఆధారపడిన జీవితములో రక్తి నశించిపోతుంది. కర్తృత్వభావం కూడా అంతరిస్తుంది. నైతిక ఆధ్యాత్మిక నియమం భగ్నమవుతుంది. పర్యవసానంలో కనువిప్పు కలిగి అసలు మన నాగరకతలోనే ఏదో దోషం ఉన్నదనిపిస్తుంది. ప్రకృతికి సన్నిహితంగా పూర్వకాలపు

నిరాడంబర జీవితమునే మరల అవలంబించాలని కొందరు అంటూ ఉంటారు. ఆ జీవితంలో పూర్వం ఎంత సుగుణం ఉండినా, మనం వెనుకకు మరలడమనేది సాధ్యంకాదు. ఏమంటే, ప్రపంచమే మార్పు చెందింది. ఎవరైనా ఒకానొక వ్యక్తి వైరాగ్యంవల్ల సన్యాసి కావచ్చు. మొత్తం సంఘమంతా అలాకావడం సాధ్యంకాదు. ఎన్ని సమస్యలుండనీ, ఎన్ని బాధలుండనీ, జీవితాన్ని ఆలంబనంగా స్వీకరించి, ఆ జీవితాన్నే వీలయినంతవరకు చక్కపరుచుకోవలెను. అలా చేయక పోతే అసలు సంఘమే నశిస్తుంది.

ప్రకృతి శాస్త్రంలోనూ, సాంకేతిక విద్యలోనూ కలిగిన అభివృద్ధి మూలంగా ప్రపంచంలోని ఆర్థిక సమస్యలు చాలావరకు పరిష్కారం కావడం సాధ్యమేనని రూఢిగా చెప్పవచ్చు. తద్వారా ప్రపంచంలోని ప్రతివ్యక్తికీ సాధారణ జీవితావసరాలు సమకూడగలవు. జీవన ప్రమాణాలు పెరగడానికీ, సాంస్కృతిక వికాసానికి మార్గమేర్పడడానికీ అవకాశం ఉంటుంది. ఈనాడు సంక్షేమ రాజ్యమూ, వర్గరహిత సంఘమూ అనేవి ఒక్క సోషలిజముకు మాత్రమే సంబంధించిన ఆదర్శాలు కావు. పెట్టుబడి విధానంలో ఉన్న దేశాలు కూడా వాటినే ఆదర్శాలుగా అంగీకరిస్తున్నవి. కాని సాధనా పద్ధతులుమాత్రం భిన్నంగా ఉన్నవి. ప్రాతిపదికమైన ఆదర్శాలు క్రమంగా ఒకదాని కొకటి దగ్గరగా రాగలవు. ఈ విభిన్నమైన పద్ధతులు ఏవో కొన్ని తార్కిక సిద్ధాంతాల మీద ఆధారపడడమేకాక, ఒక దేశానికి గాని ఒక సంఘానికి గాని చెందిన భౌగోళిక, చారిత్రక, మత, ఆర్థిక, సాంఘిక, సంస్కృతీ వికాసంమీదనూ, పూర్వపు స్థితిగతులమీదనూ కూడా ఆధారపడగలవు. వాస్తవమైన ఏ మార్పును గాని బలవంతంగా విధించుటకు వీలులేదు. ఆ మార్పు క్రమవికాసం పొందాలి. ఏ దేశంగాని—ముఖ్యంగా చిరకాలంనుండి నాగరకత వహించిన దేశం—భూతకాలంలో వేళ్ళుపాదుకొని ఉంటుంది. హాని కలుగకుండా వాటిని సమూలంగా పెకలించడం సులభంకాదు. హానికరమైన, బూజుపట్టిన ఆచారాలనూ వ్యవస్థలనూ పీకివేయడంమాత్రం అగత్యం. అవి చెత్త చెదారం వంటివి. ప్రకృతిసహితం ఒక విధమైన సమతూకాన్ని (equilibrium) నెలకొల్పు కుంటుంది. దాన్ని ఆకస్మికంగా తారుమారు చేస్తే దుష్టఫలితాలు రాకతప్పదు. అలాగే ఒక సంఘంలో గాని, దేశంలో గాని, హఠాత్తుగా జీవిత పద్ధతుల తారుమారు సులభమూ కాదు, వాంఛనీయమూ కాదు. ఆవిధంగా ఏ సమస్య

నైనా పరిష్కరించడానికి యత్నించినా, అంతకు మించిన క్లిష్టసమస్యలు తీవ్ర రూపాలలో ఏర్పడవచ్చు.

ఈ సూత్రం వర్తించేది బహిః ప్రపంచ వ్యవహారాలకే కాదు. మానవుల ఆంతరంగిక జీవితానికి ఇంకా ఎక్కువగా వర్తిస్తుంది. అనాగరక జాతులతో వ్యవహరించడములో అతి శీఘ్రమైన మార్పులను ప్రవేశపెట్టుటకై పూనుకోవడం వల్ల కలిగే దుష్టఫలితాలు మనకు బాగా తెలుసును. అధిక వికాసం పొందిన సంఘాలలో శీఘ్రపరివర్తనంవల్ల అంతటి ఆపత్తు కలుగకపోవచ్చును. కాని అణుయుగంలో ఆకాశయాత్రలు సాగే భవిష్యత్కాలంలో జీవశాస్త్రానికి సంబంధించినట్టియూ ఇతరములైనట్టియూ విపరీతమైన మార్పులు ఏమి రానున్నవో ఎవరికీ తెలియదు.

బాహ్యస్థితి ఈ విధంగా ఉంటే, మానవుని మనస్సులోనూ, భావాల లోనూ, ఆత్మలోనూ అంతకు మించిన మార్పులు కలగడం స్పష్టమే. మానవ చరిత్రలో ఎన్నడూ లేనంతగా, ఈనాటి మానవుడు తన కార్యకలాపంలోనూ వ్యవస్థలలోనూ మార్పే శాశ్వత భాగస్వామిగా తోడునీడగా జీవించక తప్పదు. ప్రకృతి శాస్త్రమూ సాంకేతిక శాస్త్రమూ సమకూర్చే ఫలితాలను వినియోగించుకుంటున్నా, ఆ మార్పులవెంట పరుగులిడి వాటిని అందుకోవడం మనిషికి సాధ్యం కాకుండా ఉన్నది. వాటిని సరిగా అర్థంచేసుకోలేకపోతున్నాడు. సమగ్రమైన మానవ వ్యక్తివికాసానికినీ, సాంఘిక వ్యాపారాలను నిర్వహిస్తూ సామూహిక జీవితంలో పాల్గొన కలిగేటట్లు యువకులను సిద్ధపరచుటకున్నూ, విద్య ఉపకరిస్తుందని మన భావన. కాని, సంఘం రోజు రోజుకూ మార్పు చెందుతూ ఉన్నప్పుడు, ఏ లక్ష్యంతో ఏ విధంగా యువకులను సిద్ధపరచడమో తెలియదు. భారీ స్థాయిలోనున్న సాంకేతిక నాగరకతకూ, పూర్వకాలపు సాంఘిక వ్యవస్థలూ వాటి మూలతత్వానికీ, పొందిక కుదరడం లేదు. మానవునికి ప్రకృతితోగల సంబంధమే కాక, తన వ్యక్తిత్వంతోటి సంబంధం కూడా మార్పు చెందుతూ ఉన్నది. యంత్రాత్మికమైన సంఘంలో, మానవుని వ్యక్తిత్వానికి విలువ తగ్గిపోతుంది. వ్యక్తి, సంఘమనే మూకలోపడి తన వ్యక్తిత్వాన్ని కోల్పోతున్నాడు. మూక ఉమ్మడిగా సాంఘిక ఆర్థిక అభివృద్ధిని సాధించడమే నిత్యలక్ష్యంగా పెట్టుకున్న సంకీర్ణ వ్యవస్థలో, వ్యక్తి ఒక పనిముట్టుగా మారే అవకాశం ఉన్నది.

వ్యక్తియొక్క స్వేచ్ఛావికాసాలకు మనలో చాలామంది ఎంతో గొప్ప విలువను కట్టుతున్నాము. ఇందుకు కొన్ని విధాలైన ఆదర్శ ప్రాతిపదికలు అనుకూలించేవీ, కొన్ని ప్రతికూలించేవీ. కాని వీటికంటే కూడా వ్యక్తి యొక్క విలువను క్షీణింపచేసే ప్రబలశక్తులు, యాంత్రికప్రాబల్యమూ స్వయం కర్తృకమై వ్యక్తితో నిమిత్తంలేని యాంత్రిక చాలనమూ.

# 9

ఈ మార్పుల ఫలితాలు విశేషంగా నేటి యువతీ యువకులలో మనకు గోచరిస్తున్నవి. పిన్నల, పెద్దల మధ్య ఏర్పడిన వ్యత్యాసాలను చూచి తలిదండ్రులూ, విద్యాగురువులూ, సంఘసేవకులూ బాధపడుతున్నారు. పెద్ద లవలంబించిన ప్రవర్తనా రీతులు ఈనాడు పనికిరావడంలేదు. పూర్వకాలపు నైతికప్రమాణాలను త్రోసివేస్తున్నారు. కొన్ని విపరీత సందర్భాలలో నేరాలూ, త్రాగుడూ, విధ్వంసనా, కాముకత్వమూ పొడచూపుతున్నవి. దీనికి తోడు బ్రతుకుమీదనూ, కృషిమీదనూ అలసతా, నిరసనా ప్రబలుతున్నవి. అనుక్షణం మార్పు చెందుతూ ఏ విధమైన హామీగాని, నిశ్చయంగాని లేనట్టి ప్రపంచంలో "జలసా" బ్రతుకుమీద "మోజు" హెచ్చుతుంది. జాతీయసంస్కృతి అంతరించే అపాయస్థితిన్నీ, సంఘవ్యవస్థ విచ్ఛిన్నమయ్యే సూచనలున్నూ కనబడుతున్నవి.

ఈ విధంగా భావించడం "అతి" అనిపించవచ్చు. నేటి వాస్తవస్థితిని గూర్చి క్రమమైన విమర్శగా కనుపడకపోవచ్చు. కాని ఇటువంటి సూచనలు గోచరించడంలో సందేహంలేదు. భారతదేశమూ క్రిందిమెట్టులో నున్న ఇతర దేశాలలోనూకన్న, అభివృద్ధినందిన దేశాలలోనే ఈ పరిస్థితి అధికంగా ఉన్నది. ఈ లక్షణాలు మనకుకూడా సంక్రమించవచ్చును. అందువల్ల వీటిని గుర్తించడం అవసరం. బహుశః శీఘ్రపరివర్తనం జరిగే యుగసంధిలో ఈ ఫలితాలు కలగడం అనివార్యమేమో. సాంకేతికవృద్ధితో అనుకూలించే నూతన నాగరకత క్రమంగా రూపొందుతుంది. దానితోపాటు నూతన ఆదర్శవాదాలు, నూతన సాంఘిక జీవిత వ్యవస్థలూ, నిజానికి ఒక విస్తృతమైన జీవిత సిద్ధాంతమూ ఏర్పడుతవి.

జరుగుతున్న విషయాలను నిరుత్సాహ దృష్టితో గమనించడంగా నా విమర్శను కొందరు భావిస్తారేమో తెలియదు. భారతదేశంలోనూ, ఇతర దేశాల లోనూ నేను పొందిన అనుభూతినిబట్టి నాకు అంతటి నిరుత్సాహం కలుగడం లేదు. కొంతవరకు ఆశనే పురికొల్పినది. నా అనుభవాన్ని నేను పరిశీలించి వ్యాఖ్యానించ లేకపోవచ్చు. కాని భవిష్యత్తు నాకు ఆశాపూరితంగానే తోచింది. దానికి కారణం చాలావరకు నా అదృష్టమే కావచ్చు. భారత ప్రజానీకం నా యెడల చూపిన అఖండానురాగమే నా పరమాదృష్టము. ఇతర దేశాలకు వెళ్ళినప్పుడు కూడా ఎక్కడగాని, ప్రజలు నాపై స్నేహ భావాన్ని, సౌహార్ద్రాన్ని ప్రకటిస్తూ సుస్వాగత మిచ్చారు. ఈ విధంగా మన భారతీయ ప్రజలపై అధికమైన అనురాగమూ విశ్వాసమూ పెంపొందించు కున్నాను. ఇతర దేశాల ప్రజలపైన గౌరవమూ అనురాగమూ వృద్ధి చేసు కున్నాను. మనం ఎంత ఇవ్వగలమో అంత మనకు తిరిగివస్తుందని నేను గ్రహించ గలిగినాను. మనం ప్రేమను ఇవ్వగలిగితే అది ఇనుమిక్కిలిగా తిరిగి మనకు వస్తుంది. ద్వేషాన్ని ఇస్తే ద్వేషమే మనకు లభిస్తుంది. ప్రతిచోటనూ ప్రజలు శాంతికై, సద్భావానికై, సహకారానికై ఆరాటపడుతున్నారని నేను కళ్ళారా చూసి గ్రహించాను. పరిస్థితి ఈ విధంగా ఉన్నప్పుడు కాలప్రవాహాన్ని సంఘర్షణ నుంచి సహకారానికీ, సమరాలోచనల నుంచి శాంతి కృషికీ, మరల్చడము సాధ్యమనే చెప్పవలెను. పరిస్థితి అందుకు అనుకూలంగానే ఉన్నదని నా నమ్మకం.

అన్ని దోషాలలోనూ అతినికృష్టమైనది భయమేనని నా భావం. భయం వల్లనే సంఘర్షణలూ, హింసాకాండలూ ఉత్పన్నమయేది. భయానికి ఫలితమే హింసా అసత్యమూ. మన పురాతన గ్రంథాలు అన్ని దానాలలోనూ అభయ దానమే ఉత్తమమైనదని చెప్పుతున్నవి. భయవిముక్తుడు సమస్త విషయాలనూ ఋజు దృష్టితో గమనించగలడు. భావాలలోనూ క్రియలలోనూ నీతిని నిలుపుకో గలడు. ఈనాడు ప్రపంచాన్నంతా భయమే ఆవరించుకున్నది. శక్తివంతములైన అగ్రరాజ్యాలను కూడా భయమే ఆవేశించినది. బల, సంపదలు భయాన్ని తగ్గించకపోగా నిజానికి దానిని పెంచుతవి. సిద్ధులూ, మహాపురుషులూ తప్ప మనలో ఎవ్వరూ బొత్తుగా భయంలేకుండా ఉండలేరు. కాని ఆ స్థితిని ఆదర్శంగా పెట్టుకుని అభయసిద్ధికై మనం యత్నింపవచ్చు. మన భారత ప్రజలలో భయ భావాన్ని తగ్గించడమే గాంధీజీ చేసిన మహోపకారం.

భయరాహిత్యం దయా, సహనాలకు దారితీస్తుంది. బుద్ధుని గూర్చి స్మరించినప్పుడు మనలను ముంచివే త్తేది ఆయన దయాభావం. అశోకుని స్మరించ గానే లోకాద్భుతమైన ఆయన సహనం మనలను సంకుచిత మతపంకంలోనుండి వెలికి లాగుతుంది.

జాతీయ, అంతర్జాతీయ—జాతి, మత, వర్గ సంబంధమైన—సంఘర్షణలతో ప్రపంచం నిండియున్నది. ఈ సంఘర్షణలను కాదనడం అలక్ష్యం చేయడం అవివేకం. కాని ఈ సంఘర్షణలను సంఘర్షణలతో కాకుండా శాంతిమార్గంలో పరిష్కరించుకొనుటకై మనం యత్నింపవచ్చు.

# 10

అంతర్జాతీయంగా నేడు మనలను ఎదుర్కొంటున్న అగ్రసమస్య ప్రపంచ శాంతిని గురించి. మనలనుబాధించే భారీసమస్యలనూ తగాదాలనూ పరిష్కరించు కునే ప్రయత్నంకూడా ప్రపంచశాంతిసమస్యతో ముడివడిఉంటుంది. ఈ పరిష్కారము ఏ విధంగావస్తుందో చెప్పడం నావశంకాదు. కాని, పరిష్కారంకోసం మన మనుసరించే మార్గాన్ని గూర్చి మనకొక స్పష్టమైన భావం ఉండవలెననుకుంటాను. దాదాపు సర్వనాశకమైన యుద్ధమూ, ఏదోవిధమైన శాంతియుతపరిష్కారమూ అనే రెంటిలో దేనిని స్వీకరించడమో మనము నిర్ణయించుకోవలెను. వీటిలో ఏది గ్రాహ్యమో స్పష్టముగాకనబడుతూనేఉన్నది. శాంతిపద్ధతినే నిర్ణయించుకున్న తరు వాత, ప్రపంచములో ఉద్రిక్తస్థితిని పెంపొందించే ప్రతివిషయాన్నీనివారించవలెను. యుద్ధభావాన్ని పూర్తిగా తుడిచివేయాలన్న దృఢనిశ్చయానికి రావలెను. ఎందుకంటే, యుద్ధంవల్ల విజయంగాని, విజయఫలితాలుగాని రాగలవన్న నమ్మక మేమీలేదు. ఏక్షణంలో యుద్ధం వస్తుందో అనుకుంటూ కాచుకుని ఉండడమూ, ఎటూతోచకుండా కాలం గడపడమూ, తెలివితక్కువ పని. పరస్పర భేదాలు ఉన్నా, క్రోధపూరితమైన విమర్శనలను దూషణలను మానుకోవాలి. ఏకూటం గాని అవతలివైపు సగం ప్రపంచమూ కేవలం దుష్టపూరితమని నిరసించడం అసంగతం. కాపిటలిస్టు దేశాలనుగాని కమ్యూనిస్టు దేశాలనుగాని విమర్శించడం

సులభమే. కాని, రెంటిలోనూ దోషాలు పెల్లుగా ఉండినా, గొప్ప గుణాలు కూడా ఉన్నవి. లోలోపల సంఘర్షణలు ఉండినా, రెండూ ఒకమార్గాన్నే అనుసరిస్తున్నవి. రెండూ వైజ్ఞానిక సాంకేతిక ప్రభావానికి లోబడి ఉన్నవి. కాబట్టి ప్రపంచాన్ని ఉన్నదున్నట్లుగా గ్రహించి పరస్పర సహనాన్ని పెంపొందించుకోవడమే మన కర్తవ్యం. మతాలమధ్య ప్రజ్వరిల్లిన పరస్పర ద్వేషాలు ఘోరయుద్ధాలతో సమసిపోయి, అటుతరువాత కొంత సహనం ఏర్పడినది. ఆ విధంగానే, ఆర్థిక సాంఘిక సిద్ధాంతాలలో వైరుధ్యం గలవారు పరస్పర సహన భావాన్ని ఎందుకు పెంచుకోకూడదో కారణం కనిపించదు. ఆసాంతానికి ఇరువర్గాల మీదనూ జీవితంలోని యథార్థస్థితిగతులే తను ప్రభావమును ప్రసరింప చేసి ఒక నిశ్చయానికి పురికొల్పగలవు. ప్రతిదేశానికి తన స్వంత మార్గంలో చరించి అభివృద్ధి పొందుటకు అవకాశము ఉండాలి. ఇతరదేశాలనుండి నేర్చుకోవచ్చును. కాని ఒకరి సిద్ధాంతాన్ని వేరొకరిపై ప్రయోగించకూడదు. ఈవిధంగా వేర్వేరు ఆదర్శవాదాలు ఒకదానిపై నొకటి పనిచేయడం జరుగుతుంది.

జాతీయతత్వం క్షేమకరమైనదీ, వాంఛనీయమైనదీ. దానిని అణచిపెట్టితే మరీ బలపడుతుంది. కాని అత్యధికమైన అధికారం సమకూరినప్పుడు, జాతీయ తత్వం ఇతరులపై కాలుదువ్వేటట్లు పురికొల్పవచ్చును. స్వాభిమానంతోపాటు పరులను నిరసించడం జరుగవచ్చు. ఆధునిక జాతీయతత్వం. ఇట్టి విదేశీయ సామ్రాజ్య వ్యవస్థలకూ జాతి అహంకారాలకూ ప్రతిక్రియగా ఉత్పన్నమైనది.

నేటికిన్నీ పెక్కు దేశాలలో కొద్దిగానో, గొప్పగానో జాతి అహంకారం నిలిచి ఉన్నది. కాని, దానిపట్ల నిరసనభావం కూడా విస్తరించినది. ఒక్క దక్షిణాఫ్రికా యూనియన్ మాత్రం జాతి అహంకారమే ప్రభుత్వ నీతిగా వ్యవహరిస్తున్నది. ఘోరమైన సంఘర్షణకు జాతి అహంకారము మూలమని స్పష్టపడినది. పరమదుష్టమైన నిరంకుశాధికారానికి దారితీసి, దానికి ప్రతిక్రియగా ద్వేషాన్ని పెంపొందిస్తుంది. ఈ సంఘర్షణ హింసద్వారానే పరిష్కారం కాగలదనుకోవడం నిరాశవల్ల కలిగే భావం. హింసాకాండ మూలంగా దుష్టఫలితాలు కలుగక తప్పదు. జాతి అహంకారంపట్ల ప్రపంచాభిప్రాయం తీవ్ర ప్రాతికూల్యాన్ని చూపవచ్చును. అందుకు ఫలితంగా ఏ దేశంగాని ఏ వర్గంగాని దానికి అనుకూలంగా వాదించకపోవచ్చు. ఆచరించకపోవచ్చు.

ఏ రూపంలోనైనాసరే, సామ్రాజ్యతత్వానికి గాని వలసరాజ్య తత్వానికి గాని, నేటి ప్రపంచంలో ఏమాత్రమూ తావు ఉండరాదు. అవే సంఘర్షణలకు మూలం. పెక్కు ప్రదేశాలలో అవి ఇంకా నిలిచి యున్నవి. అనేకమంది మనస్సులలో అవి పనిచేస్తూనే ఉన్నవి. కాని ప్రతిష్ఠను కోల్పోయిన సిద్ధాంతాలైనవి. వాటిని ఆచరించే జాతులు తమ చర్యలను ఏలా సమర్థించుకోగలమా అన్న స్థితిలో ఉన్నారు. కాబట్టి జాతి అహంకారాన్నీ సామ్రాజ్యతత్వాన్నీ అంతరింపచేయడమే ప్రపంచనీతిగా రూపొందాలి. తమ భవితవ్యాన్ని తామే నిర్ణయించుకొనే విధంగా ఆయా జాతులకే వదిలిపెట్టవలెను. ఇందుమూలంగా కొన్ని దేశాలలో కల్లోలమూ సంక్షోభమూ కలగవచ్చు. కాని అది పరిమిత ప్రదేశాలకే సంబంధించి ఉంటుంది. దాని ప్రభావం విశాలప్రాంతాలకు వ్యాపించదు. కొంతకాలానికి దానంతట అదే కుదుటపడవచ్చు కూడా. కాని ఏ దేశమైనా వేరొక దేశంమీద తన అధికారాన్ని విధించాలని యత్నించడమే ఈనాడు అపాయ పరిస్థితులను కల్పిస్తున్నది. ఇదే తప్పుడు త్రోవ.

సైనిక సంధులూ గూఢసమరమూ గత కాలంలో ఏదో విధంగా సమర్థనీయములైనా, ఈనాడు మాత్రం అవి భద్రతను భంగపరచుటకూ యుద్ధభీతిని పెంచుటకూ వినియోగపడుతున్నవి. దేశాలు స్వాభావికంగా పెంపొందడానికి అవి ఆటంకాలు. అవే ప్రపంచ వాతావరణాన్ని మలినం చేస్తున్నవి. గూఢ సమరం సాగినంతవరకూ సహనానికి తావులేదు. క్రింది మెట్టులోనున్న దేశాలు అభివృద్ధిపొంది తమ జీవనప్రమాణాలను పెంచుకొనుటకు సహాయపడకపోగా, ఈ దుష్టపద్ధతుల మూలంగా సైనిక సంఘర్షణలు చెలరేగి సైనిక ప్రయోజనాలే ప్రధానమవుతున్నవి. ఇందువల్ల తరుచుగా అభివృద్ధి నిరోధకములై, ప్రజానీకానికి అసహ్యాకరములైన, రాజ్యపాలనలు పరాయి సైనిక బలంతో కాలు నిలువ తొక్కుకోగలుగుతున్నవి. వీటి ఫలితంగా, భద్రత మరీ సన్నగిలిపోగలదు.

ప్రపంచంలోని బాధలనూ, సంఘర్షణలనూ, ఉద్రేకాలనూ, ఏదో మాంత్రికదండం వల్లనో మంచి మాటలతోనో తొలగించగల ననుకోవడం వాస్తవిక దృష్టి కాదు. ఉద్రేకాలను తగ్గించి ఆసాంతానికి సంఘర్షణలు సంభవించే అవకాశాన్ని కూడా తొలగించగల కార్యక్రమాన్ని ఉపదేశించడమే వాస్తవిక దృష్టి. ఈ కార్యక్రమం మనస్సుకు సంబంధించిన నూతన విధానం. రాజకీయ ఆర్థిక విధానాలు దానికి తోడు కావలెను. "పంచశీల" పేరిట

విశేషంగా ప్రశంసించబడుతున్న అయిదు సిద్ధాంతాలూ ఈ నూతన విధానానికి మార్గం కల్పిస్తున్నవి. మానసిక, ఆధ్యాత్మిక పరివర్తనం కలిగినప్పుడే ఆ విధానం వాస్తవ మవుతుంది. అర్థాన్ని కోల్పోయిన శబ్దజాలాన్ని విరజిమ్మి ప్రయోజనం లేదు. శాంతి అంటే యుద్ధ నివారణ మాత్రమే కాదు. ప్రపంచమంతటా శాంతివాతావరణాన్ని కల్పించుటకై యత్నాలు సాగించాలి.

# 11

ఈ పంచశీల సిద్ధాంతాన్ని అంతర్జాతీయ వ్యవహారములలో అనుసరించుటకు మన భారతదేశంలో ప్రయత్నించాము. కాని ఎల్లప్పుడూ దానిని జయప్రదంగా నిర్వహించామని నేను చెప్పజాలను. పర్యవసానంలో మన వైదేశిక విధానాలు మన దేశస్థితి మీదను, అభివృద్ధి మీదను ఆధారపడి ఉంటవి. కాబట్టి ప్రపంచ వ్యవహారాలలో మన కర్తవ్యాన్ని దక్షతతో నిర్వహించాలంటే మన దేశంలో మనం అభివృద్ధిని సాధించడం అగత్యం. మన సంతోషంకొరకు అట్టి అభివృద్ధి మరీ అగత్యమన్నమాట స్పష్టమే.

ప్రథమ పంచవర్షప్రణాళిక, ద్వితీయ పంచవర్షప్రణాళిక క్రింద రెండు సంవత్సరాలూ గడిచినవి. పెక్కు మార్గాలలో మనం నిర్దిష్టమైన అభివృద్ధిని పొందినాము. అందులో కొన్ని ప్రత్యక్షంగా కనబడుతునే ఉన్నవి. మరికొన్ని అంతగా పైకి కనిపించకపోవచ్చు. కొన్ని మార్గాలలో అభివృద్ధి మనం వాంఛించినంత శీఘ్రగమనంతో సాగలేదు. కాని సాధించిన అభివృద్ధిమాత్రం గట్టిదీ, సారవంతమైనదీ అన్న సంగతి మనం జ్ఞప్తి ఉంచుకోవాలి. వ్యవసాయంలోనూ, పరిశ్రమలలోనూ అభివృద్ధి స్పష్టంగా కనబడుతునే ఉన్నది. అసలు పీటిమీదనే మన భవిష్యత్తు ఆధారపడుతుంది.

ఈ అభివృద్ధికి మూలం విద్య. మూలాధార (basic) విద్యనూ, సాంకేతిక విద్యనూ వృద్ధిపరచడానికి తగిన శ్రద్ధ చూపబడుతున్నది. లక్షలాదిగా మన బాలబాలికలు స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ, సాంకేతిక సంస్థలలోనూ విద్యాభ్యాసం చేస్తున్నారు. మన జనాభాలో ఈ

విద్యార్థుల సంఖ్య స్వల్పభాగమే. ఇంకా జరగవలసిన పని ఎంతో ఉన్నది. అయినా విద్యాసంస్థలలో ఇంతమంది చేరడం విశేషమే. ఈ విద్యార్థులు తమ జీవిత వ్యాపారాలకు సంబంధించినంతవరకు ఒక నూతన మానసిక ప్రవృత్తిని అలవరచుకొని విద్యాసంస్థలనుండి బయటకు వస్తున్నారు. ఈ విధంగా నెమ్మదిగానైనా, అనివార్యంగా మన సాంఘికవ్యవస్థలు మార్పుచెందుతున్నవి. విప్లవాత్మకములైన మార్పు లన్నింటిలోనూ, స్త్రీవిద్యా విస్తరణంవల్ల కలిగే మార్పే అగ్రస్థానం వహించేది. ఈ బాలికల ద్వారానూ, స్త్రీల ద్వారానూ భారత ప్రజల సమగ్ర జీవిత స్వరూపంలో మార్పు కలుగుతున్నది. ఇకముందు కూడా క్రమక్రమాభివృద్ధిగా ఈ మార్పు జరుగుతూనే ఉంటుంది. ఇంతవరకు ఈ మార్పు పల్లెసీమలలోకంటె పట్టణాలలోనే అధికంగా కలిగింది. కాని పల్లెలలో కూడా ఈ మార్పుయొక్క ప్రభావం ప్రసరిస్తున్నది. కొలది సంవత్సరాలలోనే, బడికపోతగ్గ వయస్సుకల బాలబాలిక లందరికీ బేసిక్ (మూలాధార) విద్య లభిస్తుంది.

నేటి విద్యావిధానాన్ని గూర్చిన విమర్శ బహుళంగా జరుగుతున్నది. మన మందరమూ విద్యావిధానంలో ఏవో కొన్ని అంశాలను విమర్శిస్తూనే ఉన్నాము. కాని విద్య శీఘ్రంగా వ్యాపిస్తూ మన జీవిత పద్ధతిని మార్చుతూ ఉన్న సంగతి మాత్రం యథార్థమే.

ఇక జనాభా సమస్య ఉన్నది. ప్రపంచమంతటా జనాభా [illegible]ంగా పెరిగిపోతున్నది. ఈ పెరుగుదలనుబట్టి ఈ శతాబ్దం ముగిసేనాటికి ప్రపంచ మొత్తంలో 350-500 కోట్ల మధ్యవరకు పెంపు కావచ్చునని అంచనా వేస్తున్నారు. భారతదేశంలో 2000 సంవత్సరం నాటికి 60-68 కోట్ల మధ్యవరకు ఉండవచ్చు నంటున్నారు. కనీసం 60 కోట్ల వరకు పెరగవచ్చునని మనం ఊహించుకోవచ్చు. అదయినా పెరుగుదలను మనం కొంతవరకు నిరోధించ గలిగిన పక్షంలోనే.

ఈ జనాభా పెరుగుదలలో రెండు విషయాలున్నవి. అది మన ఆర్థిక పురోగమనానికి ప్రతిబంధకం అవుతుంది. ఇతర మార్గాలలో మనం వృద్ధిపొందుతున్నా, జీవనప్రమాణాలను తక్కువస్థాయిలోనే ఉంచుతుంది. ఇదొక విషయం. రెండవది ఏమంటే, ప్రపంచంలో విపరీతంగా పెరిగిపోతూఉన్న జనాభా మన ఆర్థిక పారిశ్రామిక సంపత్తిని మ్రింగివేస్తున్నది. ఈనాడు అమెరికాలో జరుగుతున్న విధానమే మొత్తం ప్రపంచం అవలంబిస్తే బహుశః ఈ శతాబ్దం ముగిసే

నాటికి ప్రపంచంలోని మూలపదార్థాలన్నీ హరించుకపోగలవు. అయినా అలా జరుగకపోవచ్చు. ఒకవేళ ఇతరదేశాలలో పదార్థాలవ్యయం నెమ్మదిగా సాగినా, ఉన్న పదార్థాలు కొలది శతాబ్దాలకంటె ఎక్కువకాలం నిలువజాలవు.

కాగా, మన కర్తవ్యం రెండువిధాలుగాఉన్నది. ఒకటి, జనాభా పెరుగుదలను నిరోధించడం. రెండవది, శక్తిఉత్పాదనకూ, సాధనసంపత్తిని అభివృద్ధి చేయుటకూ ఇతర మార్గాలలో అన్వేషించడం. అణుశక్తికిసంబంధించిన అభివృద్ధి మూలంగా, నూతన సాధనాలు మనకు లభ్యంకావచ్చు. జనాభా పెరుగుదలను నిరోధించడం భారతదేశంలో మనం ముఖ్యంగా గమనించవలసినది. అది వెంటనే చేయవలసిన పని.

# 12

రెండు ముఖ్య విషయాలను మనం గమనించాలి. కొన్ని జాతులలో వస్తూత్పాదనశక్తి విపరీతంగా పెరిగింది. అందుమూలంగా సంపదా బలమూ కూడా పెరిగినవి. దీనికి కారణం ప్రకృతిశాస్త్రంలోనూ సాంకేతికశాస్త్రంలోనూ కలిగిన అభివృద్ధి. ఇదొక విషయం. రెండవది ఏమంటే, అర్థమూ శక్తీ గల జాతులకున్నూ క్రిందిమెట్టులోని జాతులకున్నూ మధ్య ఏర్పడిన విపరీతమైన వ్యత్యాసం. ఈ వ్యత్యాసమే క్రమేణా విస్తరించే స్వభావం కలది. కొలది సంవత్సరాలలో చాలా విస్తరించిందికూడాను. క్రిందిమెట్టులోనిజాతుల స్థాయిని పెంచడానికై ఒకవైపున ప్రయత్నాలు జరుగుతూనేఉన్నప్పటికీ, ఈ వ్యత్యాసం కూడా అధికమవుతూనేఉన్నది. మామూలుగా ఆర్థిక శక్తులకూ ఇతర శక్తులకూ పూర్తిగా విజృంభించే అవకాశమిస్తే, భాగ్యవంతమైన జాతులు ఇంకా భాగ్యవంతములూ శక్తివంతములూ కావడమున్నూ, ఇతర జాతులు తమ ప్రాథమిక అవసరాలనైనా సంపాదించుకోడానికే బాధపడుతుండడమున్నూ జరుగుతుంది. కలవారికే అధికంగా లభించేది. ఒకే దేశంలో కూడా ఎక్కువ వృద్ధిపొందిన ప్రాంతాలు మిగిలినవాటికంటె మరీ ఎక్కువగా వృద్ధిపొందుతవి.

దీనికి ఫలితంగా జాతులమధ్య సంఘర్షణలూ యుద్ధమువలని అపాయమూ మొలకెత్తుతవి. తగ్గు స్థాయిలో నున్న దేశాలలో సాంఘికంగా అశాంతి ప్రబలుతుంది. వైరుధ్యానికీ సంఘర్షణలకూ మూలమైనవి అర్థమూ బలమూ. దారిద్ర్యమూ దుఃఖమూ మరొక వైపున కల్లోలాలకూ సంఘర్షణలకూ దారి తీస్తవి. పై రెండు కారణాలవల్లనూ, భీతీ, భద్రతారాహిత్యమూ ఏర్పడుతవి. అర్థ బలాలను మితిమీరి కేంద్రీకరించడంవల్ల భద్రత కలుగకపోగా, ప్రపంచంలో ప్రస్ఫుటమవుతున్న శక్తులను సరిగా అర్థంచేసుకోవడానికే ప్రతిబంధకం ఏర్పడు తుంది. జాతులమధ్యగాని ఒకేజాతిలోగాని ఇటువంటి వ్యత్యాసాలను తగ్గించు కోవలెను.

ఈ పరమాణు యుగపు సమస్యలను గత కాలపు పద్ధతులలో పరిష్క రించడం సాధ్యంకాదు. రాజకీయాలలోగాని ఆర్థిక రంగంలోగాని ఆ ప్రాత పద్ధతులవల్ల సంతృప్తికరమైన ఫలితాలు లభించవు. అంతర్జాతీయ వ్యవహారా లలో గూఢయుద్ధం సాగుతున్నది. భయ, ద్వేషాలు దానికి అంగాలు. ఈ గూఢ యుద్ధం ద్వారా మానవకోటికి అపాయస్థితి పెరుగునేగాని పరిష్కారం కలుగదు. ఇదెంత అవివేకమో మనకు ప్రత్యక్షముగానే కనబడుతున్నది. అణ్వస్త్ర పరీక్ష లలో ఒక్కొక్క ప్రయోగంవల్ల నేటి పురుషాంతరానికేగాక రానున్న పురుషాం తరాలకు కూడా అత్యధికమైన అపాయకర ఫలితాలు కలుగుతవని ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు ఒకవైపున చెప్పుతున్నా, ఈ ప్రయోగాలు సాగుతూనే ఉన్నవి. నైతిక సూత్రాలమాట అటుంచి వివేకానికికూడా దూరమైన ఈ విధానాలను ఎందుకు అవలంబిస్తున్నట్టు ? అణ్వస్త్ర పరీక్షలను పూర్తిగా ఆపివేయవలెననీ, తక్కిన సైనిక సాధనాలను క్రమక్రమంగా తగ్గించాలనీ, వెంటనే ఏకగ్రీవంగా తీర్మానించుకుంటే ఎంత బాగుగా ఉంటుంది ? ఏజాతిగాని తనకుతానే ఒంటరిగా చేయాలంటే భీతిభావం అడ్డంవస్తుంది. కాని ఇరుపక్షాలవారూ సహకరించి సమస్తదేశాలకూ మహోపకారం కలిగించే ఈ నిర్ణయాన్ని చేసుకోవాలి.

ఆర్థిక సిద్ధాంతాలకూ విధానాలకూ ఈ తర్కమునే అన్వయింపచేయాలి. అనుకూలపరిస్థితులను పొందిన ఏ కొద్దిదేశాలో ఐశ్వర్యవంతములై ఉండడమూ, మిగతా ప్రపంచంలో ప్రజలు దారిద్ర్యంలో మునిగి ఉండడమూ అపాయ హేతుకమని సరిగా లోకం గ్రహించడంలేదు. తక్కువ స్థితిలోనున్న దేశాలు తమ ప్రమాణాలను పెంచుకోవడం ఎంత అగత్యమో, భాగ్యవంతమైనదేశాలు—

స్వకీయ క్షేమాన్నైనా దృష్టిలో నుంచుకుని— బీదదేశాల సత్వరాభివృద్ధికై తోడ్పడడంకూడా అంత అగత్యమే. ఈనాటి సమస్యలు క్రొత్త ప్రపంచానికి సంబంధించినవి. వాటిని ప్రాత ప్రపంచపు పద్ధతులతో పరిష్కరించడం సాధ్యంకాదు.

యుద్ధసామగ్రికోసం విపరీతంగా ధనాన్ని వెచ్చించడం విషాదకరంగా ఉన్నది. దానివల్ల ప్రపంచంలో సాంఘికాభివృద్ధికి ఎంతైనా దెబ్బతగులుతున్నది. ఏది సమాధానానికి మార్గమో ప్రత్యక్షంగా కనిపిస్తూ ఉన్నా, అవివేకమూ భీతీ అలాగే ఉండిపోవడం చాలా విషాదకరం. సైనిక విధానాలవల్ల సమాధానం కుదరదు. సైనిక విధానాలు విస్తరించేకొద్దీ భీతీ ఉద్రేకమూ మితిమీరిపోతవి. ప్రత్యేకంగా ఏ దేశంపైన గాని నేను నిందమోపడం లేదు. కొద్దిగానో గొప్పగానో ప్రతి దేశాన్నీ ఈ భయవాతావరణం ఆవరించి యున్నది. ఏదేశమూ ఆ వాతావరణంలో నుంచి బయటపడలేకుండా ఉన్నది. ఇతర దేశాలతో మన సంబంధాలను నెలకొల్పుకోవడంలో ఆ వాతావరణాన్ని మార్చడానికి యథాశక్తిగా కృషి చేయడమే మన కర్తవ్యం.

పెట్టుబడివిధానం సాగిన పూర్వకాలంలో—చాలావరకు నేడుకూడా— వస్తూత్పత్తికి అత్యంత ప్రాధాన్య మీయబడినది. పూర్వకాలంలో అది అవసరమైనది. కాని వస్తూత్పత్తి మాత్రమే మన సమస్యలను పరిష్కరించి మనకు సుఖాన్నీ సంతృప్తినీ కలిగించజాలదని క్రమేణా స్పష్టపడినది. ధనకాంక్షా, సంపాదనాసక్తి పెరిగేకొద్దీ అసూయా ద్వేషాలుకూడా పెరుగుతవి. సంఘంలోనూ ప్రపంచంలోనూ సమతూకాన్ని నెలకొల్పడమే మన లక్ష్యమైతే, కేవలం వస్తూత్పత్తితోనే దానిని సాధించలేము. నిజానికి హెచ్చుతగ్గులు అధికమయ్యే అవకాశం ఉన్నది. కాబట్టి వస్తుసంపదను న్యాయంగా పంపిణీ చేయడమూ, పదార్థములను సక్రమంగా వినియోగపరచడమూ ప్రధాన సమస్యలు. పర్యవసానంలో ప్రతివ్యక్తి తన జీవితాన్ని తనకూ సంఘానికీ కూడా ఫలప్రదమయ్యేటట్లు గడుపుకోగల వివేకాన్ని సంపాదించడమే కావలసింది. మానవజీవిత లక్ష్యాలనూ నైతిక సమస్యలనూ గమనించకుండా ప్రకృతిధర్మాలకు ఏవో వ్యాఖ్యానాలు చేయడం క్రమమైన ఆర్థిక నీతిగా ఇకముందు అంగీకరింపబడదు.

# 13

ఈ మహత్తర విషయాలను నేను పదే పదే నొక్కి చెప్పవలసి వస్తున్నది. వాటినుండి మనం తప్పించుకు సంచరించడం సాధ్యంకాదు. మన ఆంతరంగిక దేశీయ సమస్యలమీద కూడా వాటి ప్రభావం ప్రసరిస్తుంది. ఈనాటి సందర్భా లనుబట్టి మన సమస్యలను పరిష్కరించుకోవడమే దుర్ఘటమయ్యే విధంగా అను పూర్విక భావాలు మనలను కట్టివేస్తున్నవి. దారిద్ర్యం పరమనీచమైన స్థితి. దానినుండి విముక్తి నొందడమే సహజమైన ప్రవృత్తి. దారిద్ర్యంలో మ్రగ్గుతూ స్వాతంత్ర్యాన్ని గూర్చి ప్రసంగించడం కేవలం అసంగతం. దారిద్ర్యంయొక్క లక్షణమేమిటంటే, అప్రయత్నంగా దానంతట అదే పెరిగిపోయి స్థిరపడుతుంది. అయినా, వ్యక్తిగాని సంఘంగాని మితిమీరిన భోగభాగ్యాలను సేకరించడంకూడా అనేక దోషాలకు అవకాశమిస్తుంది. అట్టి దోషాలు నేడు ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉన్నవి. వట్టి భౌతిక సంపత్తిని అదేపనిగా కూడబెట్టడం, మానవుని ఆంతర జీవితంలో నిస్సారతను కల్పించవచ్చు.

వాస్తవంలో సోషలిస్టు విధానం ఆర్థిక సూత్ర ప్రాధాన్యంకలది. పైన ఉదహరించిన ఉత్తమ విషయాలను కూడా సోషలిజం పరిశీలనలోకి తీసుకుం టుంది. అయినా సోషలిజంలో ఒక అపాయంఉన్నది. ఏమంటే, భాగ్యాభివృద్ధినీ న్యాయమైన పంపిణీ విధానాన్నీ సాధించినా, జీవితానికి సంబంధించిన కొన్ని సార్థకవిషయాలు లోపించవచ్చు. అందుకే ముఖ్యంగా వ్యక్తిప్రాధాన్యాన్ని ఉద్ఘాటించడం అగత్యమవుతున్నది.

భారతదేశంలో ఈనాటి మన సమస్యలన్నీ ప్రధానంగా ఆర్థికాభివృద్ధికిన్నీ జీవనప్రమాణాల పెంపుదలకున్నూ సంబంధించినవి. మనం బుద్ధిపూర్వకంగా విమ ర్శించి సోషలిస్టు నమూనా సమాజస్థాపనను లక్ష్యంగా నిర్ణయించుకున్నాము. కాని ఆలక్ష్యాన్ని బాగా స్పష్టంగా నిర్వచించలేదు. అంత రూఢిగా నిర్వచనాలు కావించడం వాంఛనీయం కాదని నా ఉద్దేశం. అట్టి నిర్వచనాలు కఠిన సిద్ధాం తాల క్రిందనూ నినాదాల క్రిందనూ మారిపోయే అవకాశమున్నది. తీవ్ర వేగంతో మారుతూ ఉన్న నేటి ప్రపంచంలో సరళమైన ఆలోచనకు కూడా

ప్రతిబంధకాలు అవుతవి. కాని అస్పష్టత మితిమీరినా కార్యదక్షతకు ప్రతిబంధకమే. కాబట్టి లక్ష్యాలు నిర్దిష్టంగా ఉండాలి. ఆ లక్ష్యాలను చేరుకోవడం ఎలాగన్న విషయంలో కొన్ని నిశ్చితాభిప్రాయాలు కూడా ఉండాలి. ప్రతి దేశమూ ఇతర దేశాల ఒత్తిడి లేకుండానే అభివృద్ధిపొందవలెనని చెప్పినాను. ఇతర దేశపు సహాయమూ సలహాలూ మనం స్వీకరించవలసిందే. కాని బయటి ఒత్తిడి వల్ల వాస్తవమైన అభివృద్ధికి ఆటంకం కలుగుతుంది. సంఘర్షణ కూడా సంభవిస్తుంది. కాబట్టి ఏ దేశం గానీ సాధ్యమైనంతవరకు ఇతరదేశాలకు అపాయం లేకుండా, తన పద్ధతి ననుసరించి రూపొందడానికి అవకాశం ఉండవలెను. మనలో ఎవ్వరు గానీ తామే సత్యాన్ని గుత్తకు తీసుకోలేదన్న సంగతిని అంగీకరించాలి. ఒకరికి హితమైనది భిన్నపరిస్థితులలో జీవించే వేరొకరికి హితం కాకపోవచ్చునని కూడా గ్రహించాలి. ఈ ప్రపంచంలో మనకు సమ్మతంకాని పెక్కువిషయాలతో సరిపెట్టుకుంటూ జీవించకతప్పదు. మన ప్రవర్తన, కార్యవిధానం, స్నేహసహకారముల వల్లనే మనము ఇతరులపై పలుకుబడిసంపాదించవలెను. ఈనాడు విభిన్నసిద్ధాంతాల మధ్య ఎంతభేదమున్నా, సామాన్యలక్షణాలు కూడా పెంపొందుతున్నవనీ, వాటిని సన్నిహితం చేస్తున్నవనీ నా నమ్మకం. భయమూ, బెదరింపూ, బలవంతమూ లేనిపక్షంలో ఈ సిద్ధాంతాలు ఇంకా సన్నిహితంగా ఉండేవే. అనగా జాతుల మధ్య రాజకీయ, ఆర్థిక రంగాలలో ఇప్పటికి ఏర్పడిన స్థితియే యథాతథంగా మనం సామాన్య పద్ధతిలో అంగీకరించాలి పరిష్కారం కావలసిన సమస్యల విషయంలో శాంతిపద్ధతులలోనే వ్యవహరించాలి.

ఒకే జాతిలోనూ సంఘర్షణలు ఉంటవి. అయితే ఒక భేదం ఉన్నది. వయోజన నియోజకత్వం గల ప్రజాస్వామిక వ్యవస్థలో చట్టబద్ధమైన పద్ధతులలో ఆ సంఘర్షణలను పరిష్కరించుకోవడం సాధ్యమవుతుంది. మొత్తంమీద నేటి కాలంలో మతసంఘర్షణలు చెలరేగడంలేదు. ప్రపంచంలో జాతి అహంకారం వల్ల ఏర్పడిన సమస్య మిగిలి ఉన్నా, జాతిగతసంఘర్షణలు ప్రపంచంలో ఏ కొలది ప్రదేశాలకో పరిమితమైనవి. భారతదేశంలో ప్రాంతీయములూ, భాషావిషయకములూ ప్రాతిపదికగా వ్యథాకరమైన సంఘర్షణలను మనం చూశాము. కాని, ప్రధానంగా ఈనాటి సమస్యలకు మూలకారణం వర్గగతమైన స్వార్థాల సంఘర్షణమే. అట్టి సందర్భాలలో, పాదుకొని ఉన్న స్వార్థాలబలాన్ని కూలద్రోయడం అంత సులభంకాదు. కాని భారతదేశంలో, పూర్వకాలంనాటి రాజులూ,

జాగీర్దారులూ, తాలూకాదారులూ, జమీందారులూ మొదలైన బలసంపన్న వర్గాల సమస్యలు శాంతిమార్గంలో పరిష్కారం కావడం మన మెరుగుదుము. ఈ విధంగా కొద్దిమందికి మాత్రమే శుభకరమైన ప్రాచీన వ్యవస్థను - బాగా పాదుకొన్నదానిని - తొలగించడం జరిగింది. వర్గసంఘర్షణ ఉన్న సంగతి మనం తప్పక అంగీకరించినా, దానిని పరిష్కరించడంలో శాంతిపద్ధతులనే అవలంబించక పోవుటకు కారణమేమీ లేదు. అయినా మన దృష్టిలో ఒక యోగ్యమైన లక్ష్యాన్ని - ప్రజలకు స్పష్టంగా అవగాహన అయినదానిని - నిలుపుకున్ననాడే శాంతిపద్ధతులు నెరవేర గలవు.

## 14

సంపాదనా సరశ్వం గల సంఘమే పెట్టుబడి విధానానికి మూలాధారం. అట్టి సంఘం వర్తమాన యుగానికి తగినది కాదని నా ఉద్దేశం. పూర్వకాలంలో ఒకప్పుడు అది తగినదిగా ఉండి యుండవచ్చు. అదీగాక పెట్టుబడి విధానంవల్ల అనేక లాభాలు కలిగిన మాటకూడా వాస్తవమే. కాని ప్రపంచం ఆ స్థితిని దాటినది. ఆ విధానం అతి క్లిష్టమై సమ్మర్దంగా ఉంటుంది. ఒకరి గడపలో ఒకరు ఇరుకుగా కూర్చున్నట్లు ఉంటుంది. కాబట్టి, ఆధునిక అవసరాలకూ, పరిస్థితులకూ అనుగుణంగా నుండి అధిక పోటీలకు అవకాశ మివ్వకుండా సహకారంమీదనే ఎక్కువగా ఆధారపడిన ఉత్తమ వ్యవస్థను మనం నిర్మించుకోవాలి. అది చివరకు ప్రపంచ రాజ్యస్థాపనగా పర్యవసానం పొందాలి. ప్రతి జాతీ ఇతర జాతుల వ్యవహారంలో జోక్యం కలిపించుకోకుండా తన ఇష్టానుసారం వృద్ధిపొందుటకు తగిన స్వేచ్ఛావాతావరణం కలిగిననాడే ప్రపంచరాజ్య స్థాపనకు అవకాశం ఉంటుంది.

లాభాలు గడించడమే పరమ ప్రయోజనంగా పెట్టుకున్న సంఘానికి వర్తమాన ప్రపంచంలో తావులేనట్లే కనిపిస్తున్నది. అంశమాత్రంచేత కార్యాచరణలో తృష్ణని పురికొల్పగల ప్రేరణలు ఉండరాదని కాదు. ఆ ప్రేరణలు ధన లాభానికి మాత్రమే కట్టుబడినవి కాకూడదు. సాహసమూ, అన్వేషణాసక్తి, కష్టనష్ట

ముల నెదుర్కోగలసామర్థ్యమూ వర్థిల్లేటట్లు మనం ప్రోత్సహించాలి. వీటిద్వారానే మన జీవితాలకు రక్తి, పరిపూర్ణత్వమూ చేకూరుతుంది. వ్యక్తిగత (private) వ్యాపారానికీ, కార్యకలాపానికీ విశాలమైన అవకాశంఉంటూనే ఉంటుంది. కానివాటికైనా ధనసంపాదనమే ముఖ్యప్రయోజనంగా ఉండకూడదు. భారత దేశంలో మనం ఆలస్యంగానే పారిశ్రామిక విప్లవరంగంలో అడుగు పెట్టినాము. ప్రపంచంలో కొన్ని భాగాలు ఆకాశయానం అణ్వస్త్ర సాధనలలో ఆరితేరుతున్న యుగంలో మనం పారిశ్రామికరంగంలో ప్రవేశించాము. పారిశ్రామిక విప్లవమూ అణుశక్తివిప్లవమూ తెచ్చినమార్పులతో, ఏకకాలమందే,మనముకూడా ముందుకు సాగవలసివచ్చింది. అంటే మనం విపరీతమైన భారాన్ని మోయవలసివచ్చింది. సోషలిజమును మనలక్ష్యంగా స్వీకరించడం, అది సవ్యమూ శుభదాయకమూ నన్న కారణంవల్ల నేకాదు. మన ఆర్థిక సమస్యలకు సోషలిజము తప్ప వేరే పరిష్కారమార్గం లేదు. శాంతియుతంగా ప్రజాస్వామిక పద్ధతులతో అభివృద్ధి శీఘ్రంగా కలగదనీ, నిరంకుశమైన అధికార నిర్బంధాలను అవలంబించాలనీ, కొందరి ఉద్దేశ్యం. దీనిని నేను ఆమోదించను. నిజానికి ఈనాడు భారతదేశంలో ప్రజాస్వామిక పద్ధతులను త్రోసిపుచ్చుటకు ఎట్టి ప్రయత్నమైనా కావించితే, అది విచ్ఛిన్నానికే దారితీస్తుంది. శీఘ్రకాలంలో ఏదైనా అభివృద్ధిని సాధించే అవకాశాన్ని పూర్తిగా నాశనంచేస్తుంది. దీర్ఘకాలికమైన దృష్టితో పరిశీలించినా వ్యక్తియొక్క ఘనతలోనూ, సాధ్యమైనంత వైశాల్యంగల వ్యక్తి స్వాతంత్ర్యం లోనూ నాకు విశ్వాసమున్నది. కాని, సంశ్లిష్ట స్వరూపంగల సంఘంలో స్వాతంత్ర్యానికి పరిమితి ఉండాలి. లేనిపక్షంలో ఇతరులకు హాని సంభవింపవచ్చు.

మనం పూనుకున్న ఈ మహత్తర కార్యసాధనకు ప్రజల పూర్తిసహకారం ఉండాలి. ప్రజలకు ఆమోదకరమైన ఫలాశను కల్పించే లక్ష్యాన్ని ముందు పెట్ట గలిగినప్పుడే ప్రజల సహకారం లభిస్తుంది. మనం వాంఛించే మార్పువల్ల ప్రజల మీద భారం మోపడం అగత్యమవుతుంది. శక్తిచాలని వారిపైన కూడా భారం మోపడం తప్పక పోతుంది. తమకు లాభకరమైన సంఘనిర్మాణంలో తాము పాలుగొంటున్నామని గ్రహించినప్పుడే ప్రజలు ఆ భారాన్ని వహించడానికీ పూర్తిగా సహకరించడానికీ సిద్ధపడతారు. "స్వేచ్ఛావ్యాపార వ్యవహార" మనేది ("free enterprise") అప్రధానమైన ప్రయోజనాలకై సాధన సామగ్రిని వినియోగించడానికే తరుచుగా దారితీస్తుంది. అందువల్ల అది ఎన్నటికీ మన

ప్రజలకు నచ్చదు. సంఘపరమైన దృష్టి లేకుండా వ్యక్తిపరమైన లాభదృష్టికే ప్రాధాన్యమునిచ్చి, స్వప్రయోజనాసక్తిని పురికొల్పి, దానిని వినియోగించుకోవడమవుతుంది.

సాంఘికన్యాయమూ, సమత్వమూ కావాలన్నదే ఈనాడు ప్రపంచంలో బలీయమైన వాంఛగా నున్నది. ప్రాత భూస్వామ్య పద్ధతిలో భూమి ఏకొద్ది మంది స్వాధీనంలోనో ఉండడమూ మిగతా జనం తినీతినక బ్రతకడమూ జరుగుతూ ఉండేది. ఆ వ్యవస్థ ఈనాడు ఎవ్వరూహర్షించరు. ఆవిధంగానే ఈనాడు వ్యాప్తిలోనున్న పెక్కు వ్యవస్థలు కూడా తమ ప్రాబల్యాన్ని కోల్పోతున్నవి. ప్రజల భావాలకు గాని శాస్త్రీయ పురోభివృద్ధికి గాని అవి అనుకూలించేవి కావు.

# 15

మనం నిర్వర్తించవలసిన కార్యస్వభావాన్ని బట్టి ఒక శాస్త్రీయమైన పథకాన్ని చక్కగా ఆలోచించి సిద్ధపరుచుకోవడమూ, ఆ పథకాన్ని ఆచరణలో పెట్టడమూ అవసరం. మనకు లభ్యమైన సాధన సామగ్రిని ఉత్తమ మార్గంలో వినియోగించడమూ, మన లక్ష్యానికి అనుకూలంగా జాతియొక్క కృషిని మలచడమూ అట్టి పథకం ఉన్నప్పుడే సాధ్యపడుతుంది. ఈ విజ్ఞానయుగంలో వ్యక్తి లాభాలనే ముఖ్య ప్రయోజనంగా పెట్టుకొని ఎవరికివారు ఏ విధంగానో ఏమేమో చేయాలన్న ప్రవృత్తి కొంతమందిని ఇంకా అంటిపట్టుకుని ఉండడం విచిత్రంగా కనబడుతుంది.

మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మధ్యకాలంలో ఉన్నాము. తృతీయ ప్రణాళిక మనకు కనుచూపు మేరలో ఉన్నది. మనం సాధించవలసిన భౌతిక లక్ష్యాలనూ, వాటిని సాధించగల విధానాలనూ, ఈ ప్రణాళిక నిర్దిష్టంగా చూపవలసిన సమయం ఆసన్నమైనది. మన రాష్ట్రపతి పార్లమెంటులో కావించిన ప్రసంగంలో చెప్పినట్లు, "మూడవ ప్రణాళిక ముగిసేనాటికి మన మూలపరిశ్రమలకున్నూ, వ్యవసాయికోత్పత్తికిన్నీ, జానపదాభివృద్ధికిన్నీ కావలసిన భావి

పురోగమనానికి దృఢమైన పునాది నిర్మితమై, స్వయంపోషకమైన, స్వయం ప్రవృద్ధకమైన, ఆర్థికవ్యవస్థకు దారితీస్తుంది." మూడవ ప్రణాళిక ముగియడంతో మన సమస్యలన్నీ పరిష్కారం కాగలవని అనుకోడంలేదు. అటు తరువాతకూడ, ఎన్నో పంచవర్ష ప్రణాళికలు అమలు జరగాలి. కాని దారిద్ర్యమనే అడ్డంకిని విచ్ఛిన్నం చేయడమే మన లక్ష్యంగా పెట్టుకున్నాము. మన అధమస్థితి నిరంతరంగా సాగకుండా నివృత్తికావడానికి అదేమార్గం.

ఈ కృషి చాలా భారమైనదే. ఏకాగ్రమైన దీక్షతో మన లక్ష్యాలవైపు పురోగమించాలంటే, ఈ భారాన్ని వహించక తప్పదు.

ఈమధ్య భూస్వామ్యమును గూర్చి కొన్ని నిర్ణయాలు చేయడమైనది. వాటిపైన కొంత విమర్శకూడా జరిగింది. ఒక గొప్ప సాంఘిక పరివర్తనం జరిగేటప్పుడు వర్గ సంఘర్షణ కలగక తప్పదు. ఇంతకుపూర్వం ఇటువంటి సంఘర్షణలను పరిష్కరించుకున్నట్లే ఈ సంఘర్షణనుకూడా సహకార మార్గంలో పరిష్కరించుకోగలమని నా నమ్మకం.

మన గ్రామీణ ప్రజల విషయంలో సహకార పద్ధతి తప్ప వేరొకమార్గం లేదని నా నిశ్చితాభిప్రాయం. గ్రామాలలో బహుళార్థ సాధక సహకార సంస్థలు ఏర్పడడం అగత్యం. వాటిద్వారానే సహకార వ్యవసాయానికి దారి తీయాలి. మన దేశపు ప్రస్తుత పరిస్థితులలో సామూహిక వ్యవసాయం సముచితమని నాకు తోచదు. మన కర్షకులు ఒక యంత్రంలో చిన్న మరలుగా మారడం నాకు సమ్మతంకాదు. మనదేశంలో జనాభా ఎక్కువ. భూమి తక్కువ. ఈ విషయాన్ని మనం విస్మరించకూడదు. మనం ముందుకు నడుస్తున్నామనీ, యుగాలనుంచీ నిలిచియున్న ఆర్థికకూపంలోనుంచి బయటపడుతున్నామనీ చెప్పడానికి ఈ సమస్యలపై సాగుతున్న వాదప్రతివాదాలే సూచనగా గ్రహించవచ్చు.

ఎంతమంచివైనా వట్టి సిద్ధాంతాలు చెప్పి మన కర్షకప్రజకు ఉత్సాహాన్ని కల్పించలేము. మనం చెప్పేదానిని వారు అర్థంచేసుకుని సహకరించేటట్లుగా ఉండాలి. వారిలో ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పాలి. అందుకోసమే గ్రామపంచాయతీలకూ గ్రామ సహకార సంస్థలకూ అధికారాలు సంక్రమింపచేయడం అవసరం. అధికారాలను దుర్వినియోగం చేస్తారనడం సమంజసమైన వాదంకాదు. అట్టి ప్రమాదాలకు సిద్ధపడాలి. కృషి ద్వారానూ తప్పుల ద్వారానూ ప్రజలు అనుభవం గడించుతారు.

సాంఘిక సంక్షేమ కార్యక్రమం మనదేశంలో ఆరున్నర సంవత్సరాల క్రింద ప్రారంభమైనది. నేడు మూడులక్షల గ్రామాలకు వ్యాపించింది. ఇది ప్రశంసనీయమైన అభివృద్ధి. దేశంలో ఉద్యమం ఇప్పటికే విప్లవాత్మకమైన ఫలితాలను కలిగించిందనీ ఇంకా కలిగిస్తుందనీ నా ఉద్దేశం. అందలి లోపాలు కూడా నాకు బాగా తెలుసును. అయితే దాని సత్ఫలితాలు అంతకుమిక్కిలిగా గోచరిస్తున్నవి. ఈ ఉద్యమ సాఫల్యం ప్రజలకు దానితో గల సంబంధాన్ని బట్టి ఉంటుంది. ఉద్యోగస్తులూ, సుశిక్షితమైన సిబ్బందీ ముఖ్యమే. కాని, ప్రధాన పాత్ర నిర్వహించవలసినది సామాన్య కర్షకుడే. ఈ ఉద్యమంమూలంగా గ్రామ సీమలలో ఒక నూతన శక్తి విస్తరించుచున్నదని నా నమ్మకం.

భూమి విషయంలో గాని, పరిశ్రమల విషయంలో గాని, పరిపాలనా నిర్మాణంలో గాని, ఆచరించవలసిన కార్యసముదాయమును బట్టి (function) వ్యవస్థలో మార్పులు అప్పటప్పటికి అగత్యమవుతవి. అంతకుపూర్వం లాభదృష్టితోనే, సంపాదనాపరత్వంతో వ్యవహరించిన సంఘానికి నూతన విలువలు ఏర్పడాలి. ఈ మార్పు పూర్తి కావడానికి కొంతకాలం పట్టక తప్పదు. లక్షలాది ప్రజల భావాలలోను క్రియలలోను మార్పుకలగాలి. ఇదంతా ప్రజల సమ్మతితో ప్రజాస్వామిక విధానంలో జరగాలి. అయితే మార్పు మరీ నెమ్మదిగా జరగ నక్కరలేదు. నిజానికి, క్రమక్రమేణా అత్యధికమైన సావకాశంతో జరగడానికి పరిస్థితులు అంగీకరింపవు.

# 16

నేటి భారతదేశం ఒక చిత్రమైన రూపం దాల్చి ఉన్నది. ఆశా, బాధా, అలసత్వమూ, నవోత్సాహమూ, పురాతనమైన ఆచార అధికారాల ఒత్తిడీ, పెక్కు విచ్ఛిన్న శక్తులూ, వీటిని మించిన ఐక్యతాభావమూ : ఈ విధమైన సంక్లిష్టత్వంలో ఉన్నాము. అయినా, ప్రజల మనఃప్రవృత్తులలో ఒక గొప్ప ఉత్సాహమూ వ్యక్తమవుతూ ఉన్నవి. నిత్యపరివర్తనం పొందుతూ ఉన్న

ఈ రంగ మధ్యంలో జీవించే మనకు దీని పూర్ణస్వరూపం గోచరించకపోవచ్చు. బయటినుండి పరిశీలించే వారికి ఎక్కువ బాగా అర్థమవుతూ ఉండడం తరుచుగా సంభవిస్తుంది.

పురాతన పద్ధతులకు కట్టుబడియుండి మొన్న మొన్నటి వరకు మార్పును తీవ్రంగా నిరోధిస్తూ వచ్చిన ప్రజలు ఈనాడు స్వయసంకల్పంతో వడివడిగా పురోగమించడం గమనించతగ్గ విషయం. మనము సరిగా గ్రహించకపోయినా, ఈనాటి భారతీయచరిత్రను రూపొందిస్తున్నాము.

ఈ తరంలో జరుగుతూ ఉన్న కృషికీ, కల్లోలానికీ పర్యవసానం ఏమిటి ? రేపటి భారతదేశం ఏలా ఉంటుందో నేను చెప్పజాలను. భారతదేశం భౌతిక స్థాయిలో వృద్ధిపొందాలని నా సహజవాంఛ. ఈ దేశంలోని బహుళ ప్రజానీకపు జీవనప్రమాణాలు పెంపొందేటట్లు పంచవర్ష ప్రణాళికలు అమలు జరగాలని కోరుతాను. ఈనాడు కుల, మత, భాషా, ప్రాంతీయాల పేరిట సాగుతూ ఉన్న సంకుచిత సంఘర్షణలు అంతరించి, కుల, వర్గ రహితమైన సంఘం నిర్మితం కావాలనీ, ప్రతి వ్యక్తికీ తన యోగ్యతకూ, సమర్థతకూ తగినట్లుగా వృద్ధి పొందుటకు సంపూర్ణమైన అవకాశం ఉండాలనీ నా కోరిక. ముఖ్యంగా కులతత్వ శాపం అంతరించగలదని నేను ఆశిస్తున్నాను. కులంమీద ఆధారపడి ప్రజా స్వామ్యంగాని సోషలిజంగాని ఉండడం సాధ్యం కాదు.

నాలుగు ఉత్తమ మతాల ప్రభావం భారతదేశంమీద ప్రసరించింది. అందులో హిందూ బౌద్ధ మతాలు ఈదేశంలోని భావౌన్నత్యంవల్ల రూపొంది నవి. ఇస్లాం, క్రైస్తవ మతాలు బయటనుండివచ్చి ఇక్కడ స్థిరముగా పాతు కున్నవి. పూర్వకాలపు మతసిద్ధాంతాల నిరూపణను ప్రకృతిశాస్త్రం నేడు ఆక్షేపిస్తున్నది. సిద్ధాంతాలతోనూ కర్మకలాపాలతోనూ సరిపెట్టుకోకుండా, జీవితానికి చెందిన ఉదాత్త విషయాలను పాటించినట్లయితే, మతానికీ, ప్రకృతి శాస్త్రానికీ సంఘర్షణ కలగనేరదు. వేర్వేరు మతాల మధ్య కూడా సంఘర్షణలు పొసగవు. ఈ సామరస్య సిద్ధికి తోడ్పడే మహాభాగ్యం భారతదేశానికే చెంద గలదేమో ! సనాతన భారతీయ సంప్రదాయానికి అది అనుగుణంగా ఉంటుంది. అశోకచక్రవర్తి చెక్కించిన శిలాశాసనాలలోని ఈ క్రింది సందేశం అందుకే తగియున్నది. ఆ సందేశాన్ని స్మరించుదాము :

"ఆధ్యాత్మిక శక్తిని పెంపొందించుకోవడం అనేక రూపాలలో ఉంటుంది.

"కాని, మూలాధారమైనది వాక్కును నియమించుకోవడం. పర మతాన్ని నిందించడమూ, అనవసరంగా అసందర్భంగా పరమతాన్ని గూర్చి చులకనగా మాట్లాడడమూ, స్వమతాన్ని పొగడుకోవడమూ మానుకోవాలి.

"సముచిత సందర్భాలలో పరమతానుయాయులను తగినట్లుగా గౌర వించాలి. ఈ విధంగా ప్రవర్తించడంవల్ల, తన మతాన్ని గౌరవించుకోవడమే గాక పరమతస్థులకు ఉపకారకంకూడా అవుతుంది. దీనికి భిన్నంగా ప్రవర్తించడం తన మతానికి హానిచేసుకోవడమేగాక పరమతస్థులకు అపకారం చేయడంకూడా అవుతుంది.

"తన మతంమీది అభిమానంకొద్దీ పరమతాన్ని నిందిస్తూ, నాదే ఉత్తమ మతమని వాదించడం తప్పకుండా తన మతానికే అపకారం చేసుకోవడ మవుతుంది."

అశోకుని కాలంలో సకల ధర్మాలు మతముచే ఆవరింపబడి ఉండేవి. ఈనాడు మనం మతాన్నిగూర్చి అంతగా తగాదాలు పడడంలేదు. నేటి తగాదాలు ముఖ్యంగా ఆర్థిక రాజకీయ విషయాలకూ, ఆదర్శవాదాలకూ సంబంధించినవి. రాజకీయ ఆర్థిక విషయాలలో మనతో వ్యతిరేకించే వారితో వ్యవహరించడములో అశోకుని ఉపదేశాన్ని మనం అనుసరించడం సమంజసం. అశోకుని భావనలో గాఢసమరానికి స్థానంలేదు. ఈనాడైనా అట్టి సమరం ఉండనవసరం లేదు.

నేటి మన కృషితో రూపొందేదే రేపటి భారతదేశం. దేశం పారిశ్రామి కంగానూ, ఇతర మార్గాలలోనూ అభివృద్ధిపొందే విషయమై నాకు సందేహం లేదు. ప్రకృతి విజ్ఞానంలోనూ, సాంకేతిక విజ్ఞానంలోనూ, ఈ దేశం పురోగ మిస్తుంది. మన ప్రజల ప్రమాణాలు పెరుగుతవి. విద్య విస్తరిస్తుంది. ఆరోగ్య స్థితి ఇంకా చక్కబడుతుంది. కళలూ, సంస్కృతీ ప్రజాజీవితాన్ని ఉజ్వలవంతం చేస్తవి. ఇది నా దృఢ విశ్వాసం. శ్రద్ధతోనూ సద్భావంతోనూ ఈ యాత్రను మనం ప్రారంభించాము. ఎంతకాలానికైనా సరే మన గమ్యస్థానాన్ని చేరు కుంటాము.

కాని నాకు పట్టింది కేవలం మన భౌతికాభివృద్ధికాదు. మన ప్రజల ఔన్నత్యమూ, ధీరత్వమూ ఏ ప్రమాణంలో ఉంటుందనేది నాకు ముఖ్యం. తమ తమ సంపదను సమకూర్చుకోవడంతోనూ, సుఖజీవనం గడపడంతోనూ మునిగి తేలుతూ ఉంటారా? పారిశ్రామికాభివృద్ధిద్వారా శక్తిని సంపాదించినందుకు

ఫలిత మింతేనా ? అలా ఉండే పక్షంలో గత కాలంలో భారతదేశం దేనికి చిహ్నంగా ఉండేదో, దేనిని గాంధీజీ ఈ యుగంలో ఆచరణరూపంగా మనకు ప్రదర్శించారో, దానికి భిన్నంగా ప్రవర్తించడమే అవుతుంది. శక్తి అగత్యమే. కాని జీవితంలో సారభూతమైనది వివేకం. వివేకంతో కూడిన శక్తియే మనకు క్షేమకరమైనది.

మనమందరమూ హక్కులూ ప్రత్యేక అవకాశాలూ కావాలంటాము. కాని సనాతనధర్మం విధినీ బాధ్యతలనూ బోధిస్తున్నది. మనవిధులను నిర్వర్తించి నంతనే హక్కులు లభించగలవు.

ప్రకృతి విజ్ఞానంలోనూ, సాంకేతిక విజ్ఞానంలోనూ మనము సాధించే అభివృద్ధితోపాటు మానసిక ఆధ్యాత్మిక ఉన్నతిని కూడా సాధించగలమా ? ప్రకృతి విజ్ఞానాన్ని మనం అలక్ష్యం చేయకూడదు. ఈనాటి జీవితానికంతా ప్రకృతివిజ్ఞానమే మూలము. కాని యుగయుగాలనుంచి భారతదేశం ఏ ప్రధాన ధర్మాలకు అంకితమైనదో వాటిని అలక్ష్యం చేయడం ఏమాత్రమూ తగదు. కాబట్టి మన శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించి పారిశ్రామికాభివృద్ధిని గడించుదాము. అయితే సహనమూ, దయా, వివేకమూ లేని భౌతికసంపదలు దుమ్ము, బూది వంటివై పోవచ్చునన్న సంగతి మాత్రం మనం జ్ఞప్తియందుంచుకోవాలి. "శాంతినిర్మాతలే ధన్యు" లన్న సూక్తిని మనం నిత్యం స్మరించాలి.



న్యూఢిల్లీ యందలి భారత సాంస్కృతిక సంబంధాల సమితి ఆధ్వర్యము క్రింద, రాజకీయ యోధాగ్రణి, మహా పండితుడూ, దయాశీలి యగు శ్రీ. శే. మౌలానా అబుల్ కలాం ఆజాద్ జ్ఞాపకార్థం యేర్పాటుచేయబడిన ఉపన్యాసములను ప్రారంభోత్సవం జరుపుతూ ప్రధానమంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ "భారతదేశం : నేడు - రేపు" అనే విషయమును గురించి ప్రసంగించారు. ఇది, నవభారతనిర్మాణమనే సవాలు నెదుర్కొనవలసిన భారతీయులకేగాకుండా, ప్రపంచమందు హృదయంగల ప్రతి స్త్రీ, ప్రతి పురుషునకు యెంతో అర్థవంత మైనది. ప్రపంచమందలి అగ్రశ్రేణి రాజకీయవేత్తలందు ఒకని గానూ, గొప్ప భావుకునిగానూ, అంతర్జాతీయ ప్రఖ్యాతిగల రచయితగానూ, కార్యవాదిగానూ పేరెన్నికగన్న శ్రీ జవహర్ లాల్ నెహ్రూ ఈ ప్రసంగమునందు కళాత్మకమైన అభిరుచిని, వైజ్ఞానిక తత్వమును మేళవించారు. ఉద్రిక్తత, విభిన్నశక్తులు స్వైరవిహారం చేస్తున్న నేటి ప్రపంచ వాతావరణమునందు క్షమ, దయాశక్తులద్వారా శాంతి సాధించబడాలని ఆయన ఆశిస్తున్నారు. "నేడు మనము చేసే కృషి ద్వారానే రేపటి భారతావని రూపొందుతుంది" అని ఆయన విశ్వాసం.